# హారలాలు

"హారలాలు—నిష్కళంకుడగు హారలాలు—
సత్యస్వరూపియగు హారలాలు—
పరులసొమ్ము నపేక్షింపని హారలాలు—
మాతృపాదద్వయము సేవించు హారలాలు"






కాపీ రైటు రిజిస్టర్డు

S. No. 857
Acc 8201

ములుగు వెంకటరమణయ్య

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది-1924

# హారల[illegible]

## కాబూలీవాలా

నా కొమార్తె అయిదుసంవత్సరముల యీడుగలది. ఆమెను మేము "మిని" యని పిలచుచుందుము. ఒక్క నిముష మైన నామె యూరకుండదు. ఎప్పుడును దేనిని గురించియో చెప్పుచునేయుండును. అందువలన నామె తల్లి తన బిడ్డనుజూచి విసుకుజెంది యామె వదరుబోతుతనమును వారించినను నేను మాత్ర మా బాలిక నట్లు చేయువాడను కాను.

ఒకదినమున నే నొక పుస్తకమును జదువుకొనుచుండగా మిని నే నున్న గదిలోనికి నెమ్మదిగ వచ్చి "తండ్రీ! మన సేవకుం డగు రామదయాళు కాకిని కాకి యని పిలుచుచున్నాడు. వాని కేమియు దెలియదు. ఏమైనను తెలుసునందురా?" అని నన్నడిగెను. నేను తా నడిగిన ప్రశ్నకు జవాబు చెప్పునంతలో నామె మరియొక గాథలోనికి దిగెను. "భోల యను సత మేఘములలో నొక యేనుగ యున్నదనియు, అది తన తొ ముతో నీరును విసరుననియు, అందుచేతనే వర్షము కురు

చున్నదని" చెప్పెను. దీనికి నీ వేమందు వనగా నేనేమిచెప్పు దునాయని యోచించుచుంటిని. అప్పుడు మిని నీకును అమ్మకును గల సంబంధ మేమి యని నన్ను తిరిగి యడిగెను.

అంత నేను కోపముతో "మినీ! నీ విచ్చటనుండి పోయి భోలతో నాడుకొనుము. నేను పనిమీద నుంటి" నని చెప్పితిని. అంత మిని నాబల్లదగ్గర కూర్చుండి తన కాలిపైన చేతితో కొట్టుకొనుచు నేమియో యాడుకొనుచుండెను. నేను పుస్తకమును చదువుకొనుచుంటిని. ఇంతవరకును ఆడుకొనుచున్న నాకూతురు తన యాటనంతయు నకస్మాత్తుగ వదలిపెట్టి కిటికీ యొద్దకు బరుగెత్తి "కాబూలివాలా! ఓ కాబూలివాలా" యని యరచుచుండెను. నిజముగా కాబూలివాడొక డప్పుడు రోడ్డు మీదనుండి నెమ్మదిగ బోవుచుండెను. తన దేశస్థు లందరివలె వదులైనవియు, మాసిపోయినవియు నైన దుస్తులను, పొడుగైన తలగుడ్డను యాతడు ధరించియుండెను. అతని వీపుమీద నొక సంచి యుండెను. అతని చేతులలో ద్రాక్షపండ్ల పెట్టె లుండెను. నా కూతురుయొక్క మనోభావము లిట్టివని నేను స్పష్టముగ జెప్పలేను కాని యామె వానిని జూచి బిగ్గరగ పిలచుచుండెను. దీని నంతయు జూచి నేను చదువు పుస్తక మానాటికి సాంతముగాదని తలంచితిని.

అప్పుడే కాబూలివాలా వెనుకకు తిరిగి మినిని జూచెను. మిని వానిని జూచి భయపడి యచ్చటినుండి పరుగుపరుగున తన తల్లియొద్దకు బోయెను. ఎందువల్లననగా కాబూలివాలా వీపుపై నున్న సంచిలో తనవంటి పిల్ల లిద్దరు. ముగ్గు రుందురని మిని తలచియుండును. ఇంతలో కాబూలివాలా మా యింటిలోనికి వచ్చెను. ఇంటిలోనికివచ్చిన పెద్దమనిషియొద్ద నేమియు కొనకుండుట మరియాదకాదని నేను వానియొద్దనున్న వస్తువులను కొద్దిగా గొంటిని. అతడు మాయింటినుండి వెళ్లుచు "అయ్యా మీ చిన్నబిడ్డ యెచ్చటనున్నదని న న్నడిగెను" మినియొక్క భయమును బోగొట్టవలెనన్న తలంపుతో నే నామెను తన తల్లియొద్ద నుండి తెచ్చి వానికి జూపితిని. మిని నా కుర్చీదగ్గర నిలుచుండి కాబూలివానివంకను వాని సంచివంకను ఊరక చూచుచుండెను. అప్పు డాతడు తన యొద్దనున్న ద్రాక్షపండ్లను, మరి యితరవస్తువులను మిని కిచ్చెదనని బిలచెను గాని అందువలన మినికి గల యనుమానము లింకను వృద్ధియాయెను.

ఇది జరిగిన కొలదిదినములకే నే నొకనాటి యుదయమున యింటినుండి బయటకుబోవుచుంటిని. అప్పుడుమిని కాబూలివాలా దగ్గరకూర్చుండి నవ్వుచు మాట్లాడుచుండెను. ఇది నాకెంతయు యాశ్చర్యమును గలిగించెను. నాతోగూడ మిని యెప్పు డంత

చనువుగ మాట్లాడి యుండలేదు. అప్పుడే కాబూలివాలా నాకూతురుయొక్క చీరకొంగున కొన్నితినుపదార్థములను మూటగట్టెను. అదినేను చూచి మినికి వాని నెందు కిచ్చితివని యడుగుచు వాని చేతిలోనొక అర్ధరూపాయిని బెట్టితిని. దాని కాతడేమియు మాట్లాడక అర్ధరూపాయిని తన జేబులో వేసుకొనెను. అంతట నే నింటిలోనుండి బయలుదేరిపోతిని. ఒకగంటసేపయిన తరువాత నే నింటికి వచ్చునప్పటికి మినిచేతిలో నేను కాబూలివాలా కిచ్చిన అర్ధరూపాయి యుండెను. అదితన కెక్కడిదని యామెతల్లి యా బిడ్డ నడుగుచుండెను. తనకాఅర్ధరూపాయి కాబూలివాలా యిచ్చెనని యా బిడ్డ చిరునవ్వుతో తన తల్లికి జవాబు చెప్పుచుండెను. ఇంతలో నే నింటిలో ప్రవేశించితిని. నాకు మినియొక్కయు, కాబూలివాని యొక్కయు స్నేహము బాగుగ దెలియును. కాబూలివాలా మినులయొక్క సమావేశ మది మొదటిది కాదు. మినికి గలిగిన భయమును తినుపదార్థముల నిచ్చి కాబూలివాలా క్రమముగ బోగొట్టెను. వారనేక హాస్యముల నాడుకొనుచుందురు. ఒక్కొక్కప్పుడు మిని వాని ముందు గూర్చుండి వాని ఘోరాకారమును జూచినవ్వుచు "ఓ కాబూలివాలా! కాబూలివాలా! నీ సంచిలో యేమున్నదని

యడుగును" దాని కాతఁడు దీనిలో నొకపెద్ద యేనుగ యున్నదని జవాబు చెప్పును.

మఱియొకప్పుడు కాబూలివాలా మినితో "చిన్నబిడ్డా, నీ వత్తవారింటి కెప్పుడు వెళ్లుమ నని" ప్రశ్నించును. "అక్కడికి నీవు వెళ్ళుచున్నావా" యని మిని వానిని వెంటనే యడుగును. అయితే కాబూలు దేశస్థులలో అత్తవారిల్లు అనుదానికి రెండర్థములు కలవు. అత్తవారిల్లనగనే ఖైదునకుగూడ అర్థమగుచుండెను. ఈయర్థమునే కాబూలివాలా మిని చెప్పిన మాటలకు జేసుకొనెను. ఆమాటవినినంతనే కాబూలివాడు ఇదుగో చూడు; మా మామగారిని కొట్టుచున్నానని చెప్పి అచ్చట లేని పోలీసు వానిని తన పిడికిలియొక్క బిగుప్పును చూపించును. దానిని మిని జూచి నవ్వును. అప్పుడు కాబూలివాలాగూడనవ్వును. ఇట్లు వారు సంతోషముగ యనేక సారులు మాట్లాడుచుందురు.

మినియొక్క తల్లి మిక్కిలి భయస్థురాలు. ఆమె యెప్పుడైన వీధిలో చప్పుడువినినను, యెవరైన నింటికివచ్చుచుండినను దొంగలో త్రాగుబోతులో యని తలచుచు వారినిజూచిమిక్కిలి భయపడుచుండును. ఇకను కాబూలు దేశస్థులను జూచిన యీమెకు కలిగిన భయమెట్లుండునో యెవరికి తెలియును. ఆదేశస్థులు పిల్లల నెత్తుకొని పోదురని వాడుక కావున కాబూలు

దేశస్థుడు మినితో మాటాడు నప్పుడు బహుజాగ్రతతో జూచు చుండు మని నాతో తరచుగ నాభార్య చెప్పుచుండును. అయితే నే నామాటలను లక్ష్యముచేయలేదు గాన మిని రహమానుల (కాబూలివాలా) యొక్క స్నేహమున కెట్టి యభ్యంతరమును గలిగియుండ లేదు

ఒకనాటి ప్రాతఃకాలమున నేను కొన్నికాగితములలోని తప్పులను దిద్దుచుంటిని. అప్పుడు యెనిమిది గంటలకన్న నెక్కువై యుండలేదు. ఇంతలో వీథిలో గొప్ప యల్లరి నాకు వినవచ్చెను. కిటికిగుండ చూచునప్పటి కిద్దరు పోలీసులు రహ మానును శిక్షించుటకు నేరస్థునివలె దీసికొనిపోవుచుండిరి. వీరి వెనుక ననేకమంది పిల్లలీచిత్రమును జూచుచు వచ్చుచుండిరి. రహమానుయొక్క బట్టలపైన నెత్తురుమరకలు గ్నుపించు చుండెను. ఆ రక్షకభటులలో నొక డొక కత్తిని దీసుకొనిపోవు చుండెను. అప్పుడు నే నొక రిద్దరి నడుగుటవలన రహమాను కొకడు కొంత పైకమును బాకీయుండె ననియు, బాకీదారుడు రహమానుకు తాను బాకీ లేనని చెప్పుటచే రహమాను కెక్కుడ లేని యాగ్రహముగలిగి వానిని జంపివేసె నని వింటిని. అప్పుడు రహమాను తన బాకీదారుని తిట్టుచు వీథివెంట బోవుచుండెను. అచ్చటికి మిని వచ్చి "ఓ కాబూలివాలా? కాబూలివాలా?"

యని రహమానును బిలచెను. ఈ మాటలు వినుటతోడనే రహమాను మినిని జూచెను. అప్పు డామె వానితో యేసుగను గూర్చి మాట్లాడుటకు వాని యొద్ద సంచి లేదు. కాబట్టి "నీవు మీ యత్త వారింటికి బోవుచుంటివా" యనివానిని ప్రశ్నించెను. ఆమాట రహమాను విని యామెతో "బిడ్డా! నేను పోవలసిన చోటి కెక్కడికో బోవుచున్నా నని" నవ్వుచు బదులుచెప్పెను. కాని యా జవాబు మినికి తృప్తిని గలుగజేయ లేదు.

చంపిన నేరమునకు రహమానుకు కొన్నిసంవత్సరములు శిక్ష విధించబడెను. తరువాత కొంతకాలమునకు మేము కాబూలివాలా సంగతియే మరచిపోతిమి. ఖయిదులో యాత డెట్టి కష్టములను బడుచుండెనో యని మే మొక్కనాడేని యనుకొనలేదు. మా మిని కూడ వానినిగురించి బొత్తుగా మరచిపోయెను. క్రొత్తక్రొత్త స్నేహితులతో నామె యాడు కొనుచుండెను. బాలికలతో తా నాడుకొనుచుండుటచే తీరికలేక మిని మునుపటివలె నా గదిలోనికి రాకుండెను. నేనునుగూడ యామెతో విశేషముగ మాట్లాడుటలేదు.

మేము మినికి వివాహముజేయ నిశ్చయించుకొంటిమి, వివాహదినము మిక్కిలి మనోహరముగ నుండెను. మంగళ వాద్యము లతిశ్రావ్యముగ వినవచ్చుచుండెను. కాని మిని

మమ్ము బాసిపోవునను సంగతి జ్ఞాపకమునకు వచ్చినప్పుడు మాత్రము మాకు మిక్కిలి దుఃఖము కలుగుచుండెను. ఇంటికి వచ్చిన బంధువులను, స్నేహితులను గౌరవించుటతోడనే నాటి దినములో విశేషభాగము గడచిపోయెను. తరువాత నేను గదిలో గూర్చుండి లెక్కలను జూచుకొనుచుంటిని. ఆసమయమున నే నున్న గదిలోని కొకనూతనపురుషుడు ప్రవేశించి నాకు వందన మొనర్చి నాయెదుటనే నిలుచుండెను. మొట్టమొదట నే నాతనిని గుర్తించలేదు. కాని కొంతసేపటి కాతడు రహిమానని నేను గుర్తించితిని. వానియొద్ద యిదివరకున్న సంచి లేదు, "నీ వెప్పుడొచ్చితి" వని నేను రహిమాను నడిగితిని. నిన్న సాయంత్రమే నన్ను జైలునుండి వదలిపెట్టిరని యాతడు నాతో చెప్పెను. ఆతడు జెప్పిన మాటలను వినుటకు నాకు చాల కష్టముగా నుండెను. అంతట నే నాతనిని జూచి "మా యింట్లో శుభకార్య మొకటి జరుగుచున్నది. నేను చాల పనితొందరమీద నున్నాను. మరియొకదినము వచ్చెదవా" యని యంటిని. వెంటనే యాతడు కొంతదూరము బోయి తిరిగి వచ్చి "అమ్మాయి మీబిడ్డను నే నొకసారి చూడవచ్చునా" యని యడిగెను.

మినితో మామూలుగ నాడుకొనవచ్చునని కాబూలి వాలా తలచెను. ఇంకను మిని తనయొద్దకు పరుగెత్తుకొనివచ్చి ఓ కాబూలివాలా, కాబూలివాలా యని యనునని యాతడను కొనెను. మునుపటివలె మినితో పరిహాస మాడుటకు తినుపదార్థముల నొక కాగితములో మూటగట్టుకొని యా కాబులివాలా దెచ్చెను. అంతట నేను "ఈదినము మాయింట శుభకార్య మగుటచే మా మినిని జూచుటకు వీలుండద"ని చెప్పితిని. అతఁడు నేను చెప్పినమాటలను విని యించుక లజ్జగలవాడై మొకనిముస మచ్చట నిలుచుండి నాయొద్ద సెలవు గైకొని వెళ్ళిపోయెను. రహమాను నట్లవమానపరచి పంపినందుకై నేను మిక్కిలి వ్యసనపడుచుంటిని. తిరిగి యాతనిని పిలువవలెనని నేను ప్రయత్నించుచుండగా యాతఁడే వచ్చి "అయ్యా! యీ వస్తువులను మీ బిడ్డకే తెచ్చితిని. ఇవి యామె కిచ్చెదరా" యని యాతడు మినికి దెచ్చిన తినుపదార్థములను నా చేతిలోబెట్టెను. వానిని నేను దీసుకొని వాటి ఖరీదును రహమాను కియ్యబోగా యాతడు నా హస్తమును గట్టిగా బట్టుకొని నన్నువారించుచు నిట్లు చెప్పెను: "అయ్యా మీరు మిక్కిలి దయార్ద్రహృదయులు. మీరుమాత్రము నన్నుజ్ఞాపకముంచుకొనుడు. నాకు ధనమేమియు నీయవలదు. నీకొక ప్రియకొమారిత గలదుగదా

మాయింటిలో నాకు గూడ యిట్టిబాలిక యొకతె గలదు. ఆమెను నేను తలంచుకొని యీ ఫలములను నీ ముద్దుకూనకు దెచ్చితినిగాని దీని వలన నేను లాభమును గోరుటలే ద”ని చెప్పుచు తన చొక్కా జేబులో చెయిబెట్టి యొక మాసినకాగిత మును దీసెను. ఆకాగితము నాతడు కడుజాగ్రతతో విప్పి నా బల్లపైన పెట్టెను. దానిమీద చిన్నహస్తమొకటి వ్రాయబడి యుండెను. అదిరంగులతో వేయబడి యుండలేదు. కానిదానిని నత డతిజాగ్రతతో జూచుకొనుచుండెను.

ప్రతి సంవత్సరము కలకత్తామహానగరమునకు సరుకుల నమ్ముకొనుట కాతడు వచ్చియున్నంతకాలము తన చిన్నకుమా రితను జూచుచున్నట్లా కాగితములోని హస్తమును జూచి యా నందించుచుండెను. దీని నంతయు నేను జూచిన పిమ్మట నా కనులనుండి బాష్పబిందువులు రాలెను.

అతడు పండ్లనమ్మి జీవించు నొక కాబూలుదేశస్థు డను సంగతి నేను మరచి పోతిని. ఆతడు నేనును సమానులమని నేననుకొంటిని. అతినికి గూడ మా మిని వంటి కూతురొక్కతె యుండెగదా యని నే నెంచితిని. వెంటనే మినిని మాయొద్దకు రమ్మని లోపలికి వార్తబంపితిని. మిని వచ్చుట కనేకాటంకములు చెప్పిరి కాని వాటి నెల్ల నేను వినలేదు. పెండ్లికూతురు ధరిం

చెడు దుస్తుల నన్నింటిని ధరించుకొని లజ్జచే ముఖము వంచుకొని మిని నా యెకుట నిలుచుండెను.

కాబూలివాలా మినిని జూచి నిశ్చేష్టితుడాయెను. ఆతడు మునుపటివలె నామెతో మాట్లాడలేక పోయెను. తుట్టతుద కాతడు నవ్వి చిన్ని బిడ్డా! నీ వత్తవారింటికి వెళ్లుచుంటివాయని యనెను. ఇప్పటికి మినికి అత్తవారింటికి వెళ్లుటయన నేమో తెలిసెను కాని దాని కాతనికి మునుపటివలె ప్రత్యుత్తర మీయలేదు. ఆమె సిగ్గు పడెను. అంతట మిని లోనికిబోయెను.

అంత రహమాను నొక వేడి నిట్టూర్పు విడచి నేలమీద కూర్చుండెను. ఆఫ్గను దేశములో నున్న తన కూతురు గూడ నిట్టిప్రాయముననే యుండుననియు, తానింటలేని కాలములో తనబిడ్డ కెట్టి యిక్కట్టులు సంభవించియుండెనో యనియు అతడు తలంచెను. అప్పుడు నే నొక బ్యాంకునోటును తీసి రహమానుకిచ్చి తన కుతును జూచుటకు స్వదేశమునకు జనుమని చెప్పితిని. ఈఖర్చు వలన మిని వివాహమునకు విద్యుద్దీపములును, మిలిటరి బాండును నేనేర్పాటుచేయలేదు. దీనిచేతమాయింటిలోని స్త్రీల కాశాభంగము కలిగెను గాని నాకు మాత్రము దూరదేశము నందున్న రహమాను తన కూతురిని జూచులే మా మిని వివాహమున కెక్కువ శోభ నిచ్చెనని తలచితిని.

# ఇంటికి వచ్చుట

ఊరిలోని పిల్లలందరిలోను చక్రవర్తి మొనగాఁడు. అల్లరి చేయుటలోను, సాహసపుపనులలోను ఆతని మించినవాఁడు మరి యొకఁడు లేఁడు. ఆదిన మొక దుష్టకార్యమును జేయుట కాతఁ డాలోచించుకొనెను.

ఆయూరియం దొక నదిగలదు. దాని యొడ్డున నొక దుంగ యుండెను. పిల్లలందరు గలసి దాని నానదిలోనికి ద్రోల్లిం చినయెడల దాని యజమానివచ్చి దుంగనుగానక యాశ్చర్యమును, కోపమును గలవాఁడగును గాన నట్టి పని చేయుట యచ్చటివారి కందరికి మిక్కిలి సంతోషముగానుండునని యాతఁడనెను. ప్రతి బాలుఁడు చక్రవర్తియొక్క సూక్ష్మబుద్ధికి విస్మయమంది యా పనిని సేయుట కందరు నిశ్చయించు కొనిరి.

అప్పుడు వారికొక విపత్తు సంభవించెను. చక్రవర్తి కొక సోదరుఁడు గలఁడు. ఆతనిని "మాఖన్" అని పిలచెదరు. ఆతఁడా దుంగమీఁద కూర్చుండి యిటునటు కదలకుండెను. అక్కడ పిల్ల లందరు వానిని జూచి నిర్ఘాంత పడిరి. ఒకపిల్లవాఁడు మాఖనును లాగి దుంగ మీఁద నుండి లేచిపొమ్మని జెప్పెను, కాని దీని నాతఁడు లక్ష్యము సేయలేదు. దీని నంతయు జూచుచున్న

చక్రవర్తి కథకాగ్రహము గలిగి యిట్లనెను. "మాఖూ! యీ నిమిషము నీవాదుంగ మీదనుండి దిగనియెడల నిన్ను ద్రోలించెదను". దీనినాలకించి మాఖను మరింతదృఢసంకల్పుఁడై దుంగ మీదనుండి కదలలేదు. చక్రవర్తి నిజముగా తన గౌరవము నిలుపుకొన దలచినయెడల తన తమ్ముని తానుచెప్పినట్లు చేసి తీరవలెను. కాని యీతనికంత ధైర్యము లేకపోయెను. అప్పుడాతని కొక క్రొత్తయుక్తిదోచెను. మాఖునుతో గూడ దుంగను ద్రోలించుడని తన స్నేహితుల కాతడాజ్ఞయిచ్చెను. ఇది యచటి వారికెల్లరకును మిక్కిలి వినోదమును గలిగించెను.

మాఖు యీమాటలన్నియు వినుచునే యుండెను గాని దుంగ మీదనుంచి కొంచెమైనను కదలలేదు. ఒకటి- రెండు- మూడు యని యచ్చటి పిల్లలెల్లరు తను బలముకొలదిని మొద్దును నెట్ట నారంభించిరి. దుంగతోగూడ మాఖును ద్రోల్లెను. దీనిని జూచి యచ్చటి పిల్లలు సంతోషముతో చప్పట్లు గొట్టుచుండిరి. కాని చక్రవర్తి కించుక భయము గలిగెను. అప్పుడు మాఖును చక్రవర్తియున్న చోటికిపరుగెత్తుకొనివచ్చి యీతనిముఖమంతయు గీరి, కొట్టి, తన్ని, యేడ్చుచు నింటికిబోయెను. చక్రవర్తి నది యొడ్డున గడ్డిని నమలుచు నేమియుందోచక గూర్చుండి యుండెను.

పడవనుండి యొకబాటసారి యొద్దునకొచ్చెను. అతఁడు చక్రవర్తిని జూచెను. "అయ్యా! యీ యూరిలో చక్రవర్తి వంశీకు లెచ్చట నుందురని" యాతడు చక్రవర్తిని బహువిన యముతో నడిగెను. చక్రవర్తితాను మునుపటివలె గడ్డిని నము లుచు నాతనితో "చక్రవర్తి కుటుంబము వారచ్చట నున్నారని" నిర్లక్ష్యముతో ననెను. కాని యాతని ప్రత్యుత్తరము వలన యా బాటసారి కేమియు దెలియలేదు. అందువలన నా నూతన పురు షుడు తిరిగి చక్రవర్తితో చక్రవర్తిగారి కుటుంబము వారెచ్చట నుండిరని యడిగెను. దానికి చక్రవర్తి తనకా శ్లాఘించుకొనుచు "పోయి కనుగొను మని" ప్రత్యుత్తర మిచ్చెను.

ఈసమయముననే చక్రవర్తి యింటినుంచి యొకనౌకరు డొచ్చి చక్రవర్తిని వాని తల్లి బిలచుచున్నదని చెప్పెను. కాని చక్రవర్తి కదలలేదు. తన్నుకొనినను, తిట్టినను గూడ లెక్కసే యక సేవకుడు చక్రవర్తిని గట్టిగా బట్టుకొని బలవంతమున నింటికి దీసుకొని పోయెను. ఇంటికి బోవుటతోడనే చక్రవర్తిని వాని తల్లిజూచి నీవు "తిరిగి మాఖనును గొట్టుచుంటివా" యని కోపముతో నడిగెను.

చక్రవర్తి—నేను వానిని గొట్టలేదు. వానిని నేను గొట్టితి నని నీ కెవరు జెప్పిరి?

తల్లి—అబద్ధము లాడవద్దు. నిశ్చయముగా నీవు మాఖనును గొట్టినావు.

చక్రవర్తి—నిశ్చయముగా జెప్పుచున్నాను. నేను మాఖనును గొట్టలేదు. ఈసంగతి నీవు మాఖను నడుగవచ్చునని యాతడు కోపముతో ననెను. "అవును; తల్లీ చక్రవర్తి నన్నుగొట్టినా డని మాఖను జెప్పెను. దీనితో చక్రవర్తి కెచ్చటలేని కోప మొచ్చెను.

అప్పుడాతడు మాఖనును బట్టుకొని తన యిషమువచ్చి నట్లు గొట్టెను. అందుచే వాని తల్లి మాఖనుకు సాయము జేయుట కొచ్చి చక్రవర్తిని గొట్టెను. చక్రవర్తి తన తల్లిని నెట్టెను. ఈసమయమున నొక నూతనపురుషు డాయింటిలోని కొచ్చెను. అతడు చక్రవర్తి మేనమామ. ఆమె తన సోదరుని జూచుటతోడనే యాయన పాదములకు నమస్కరించి యందరి క్షేమము నడిగెను. చక్రవర్తికి తన మామగారిని జూచుటతోడనే యెక్కడలేని సిగ్గు గలిగెను. భిషంబరు కొన్నిదినములు తన సోదరియింట సుఖముగ గడపెను. పిల్లల విద్యనుగూర్చి యాతడు తన సోదరి నడిగెను. ఆమె చక్రవర్తి నిష్ప్రయోజకు డనియు, మాఖను బుద్ధిమంతు డనియు భిషంబరుతో జెప్పెను. అంత నాతడు చక్రవర్తిని కలకత్తాకు తీసుకొనిపోయి తన పిల్లలతో

చదువు జెప్పించెదనని తన సోదరితో చెప్పెను. దాని కామె సంతోషముతో యిష్టపడెను. చక్రవర్తి కీసంగతి తెలిసినపు డాత డచ్చటికి బోవుట కంగీకరించెను.

చక్రవర్తి తన్ను విడచి కలకత్తాకు బోవుటవలన వాని తల్లి కెక్కువ శ్రమ నివారణ యాయెను. ఎందుచేతననగా చక్రవర్తి యేదినముననో మాఖనును యే నదిలోనో బడద్రోయు ననియు, లేనియెడల పోట్లాడి వాని తల బ్రద్దలుగొట్టుననియు కాని యెడల వాని కేయుపాయమునైనను గలుగజేయునని యామె భయపడుచుండెడిది. కాని యాతనిని మాఖనుకన్న తక్కువగ ప్రేమించెడిదిమాత్రము గాదు.

ప్రయాణమునకు సర్వమును సిద్ధముచేయబడెను. మాఖు గారిని చక్రవర్తి నిముషనిముషమును కలకత్తాకు తా మెప్పుడు బయలుదేరుదు మని యత్యాశతో నడుగుచుండెను. నాటి రాత్రియంతయు చక్రవర్తికినిద్ర లేదు. తన పెద్దగాలిపటమును, గోలిగుండ్లను, యాటవస్తువులను చక్రవర్తి మాఖను కిచ్చెను. ఈసమయమున మాఖనుపై చక్రవర్తి కధికానురాగ ముండెను.

వారు కలకత్తాకు సుఖముగా చేరినపుడు చక్రవర్తి తన యత్తగారిని జూచెను. ఆమె నిదివర కెన్న డాతడు జూచియుండ లేదు. చక్రవర్తి కలకత్తా కొచ్చుట కామె కెంత మతి

మిష్టము లేదు. తనకున్న ముగ్గురుపిల్లలను పోషించుకొనుటే యామెకు కష్టమాయెను. భీషంబరు చక్రవర్తిని కలకత్తాకు దెచ్చుట చాల అవ్యక్తపుపని యని దోచకమానదు.

అత్తగారి కిష్టములేనిది వా రింటనుండుటకు చక్రవర్తి కిష్టము లేదు. కాని పాప మాత డేమి చేయగలడు? ఎప్పుడైన నామె యొకపనిని జెప్పినయెడల పదిపనులాతడు చేయును. అట్లైనను ఆమె కాతనియందు కొంచెమైనను కనికరము గలుగ లేదు. ఇంటిలోని స్త్రీలుగూడ నాతనిని కడునీచముగ జూచు చుండిరి. చక్రవర్తికి తన స్వగృహమునకు బోవలెననెడి కోరిక కాలక్రమమున హెచ్చుదొడగెను. స్వగ్రామమున యాడిన యాటలన్నియు నాతనికి జ్ఞాపకమునకొచ్చుచుండెను. చిన్ననాటి తన స్నేహితుల నాతడెన్నడు మరచిపోలేదు తిరిగి తన తల్లి నెన్నడు జూతునా యని యాతడు పరితపించదొడగెను. దీని నెవరు గ్రహించగలరు!

చక్రవర్తికన్న తెలివితక్కువవాడు పాఠశాలలో మరి యొకడుడ్డు లేడు. ఉపాధ్యాయు డడిగెడి ప్రశ్నలలో నొకదానికైన నాతడుత్తరము జెప్పలేదు. అందువలన నా యుపాధ్యాయు డెన్ని దెబ్బలను కొట్టినను వాని నన్నింటిని చక్రవర్తి బహుసహనముతో

నోర్చుకొనెడివాఁడు. ఇతరపిల్ల లాడు కొనెడి సమయమున యాతడు దీనవదనుడై వారి నందరిని జూచుచుండెడివాడు. ఒక దినమున చక్రవర్తి తెగించి తా నెప్పుడు స్వగ్రామమునకు బోవచ్చునని వాని మామ నడిగెను. బడికి సెలవ లిచ్చువరకును బోవుటకు వీలు లేదని భీమంబరాతనితో ననెను. సెలవ లక్టోబరు నెలలోగాని రావు. అప్పటి కక్టోబరు చాలకాల ముండెను.

ఒక దినమున చక్రవర్తి తన పుస్తకమును బోగొట్టుకొనెను. పుస్తకము లన్ని యున్నప్పుడే యాతడు తన పాఠములను జదివెడి వాఁడు కాడు. కాబట్టి యిప్పుడాత డసలె పాఠములను జదువ వీలు లేకుండెను. అందుచేత నుపాధ్యాయు డాతనిపై నించుకేనియు కనికరము లేక కొట్టుచుండెను. దీనినంతయు జూచుచుండిన యింటిలోని పిల్లలు చక్రవర్తి నాక్షేపించుచు మిగుల నసహ్యించుకొనుచుండిరి. తుదకు విధి లేక తన పుస్తకము బోయినదని చక్రవర్తి తన యత్తగారితో చెప్పెను. అప్పు డామె చక్రవర్తిని కోపముతో జూచుచు "ఓరి పల్లెటూరు వెంఁద్దు! నీకు భోజనము ముప్పొద్దుల బెట్టుటయేగాక నెలకైదు పుస్తకములను గొనియిచ్చుట నాకు సాధ్యము గాద"ని మిగుల విసుగుతోననెను.

సాయంత్రము బడినుండి యింటికి వచ్చునప్పుడు చక్రవర్తికి తల నొప్పి యెక్కువగా నుండెను. మలేరియా జ్వరము వచ్చుననియాత డనుకొనెను. అత్తగారు తన్నుజూచి యెంత యసహ్యించుకొనునో యని యాతడు యోచింపసాగెను.

తెల్లవారి చూచునప్పటికి చక్రవర్తి యింటిలో లేడు. చుట్టుప్రక్కల నెంతజూచినను చక్రవర్తిగనుపించలేదు. రాత్రి యంతయు కుంభవర్షము కురియుచుండుటచే పిల్లవానిని వెదకుటకు బోయిన వారందరును తడిసిరి. ఈ సంగతి భీషంబరు రక్షకభటులకు తెలియజేసెను. తరువాత కొంతసేపటికిభిషంబరుయొక్క యింటి తలుపు నెవరో గొట్టిరి. అప్పటికింకను వర్షము కురియుచునే యుండెను. వారు భిషంబరు ముందు చక్రవర్తినుంచిరి. చక్రవర్తి దేహమంతయు తడిసి యుండెను. దేహమందచ్చటచ్చట మన్నుగూడ నుండెను. దేహమంతయు వణకుచుండెను. ముఖమును, కండ్లును జ్వరముచే నెఱ్ఱగానుండెను. దీని నంతయు భిషంబరు యొక్క భార్య జూచి "ఈ పిల్లవాని వలన మన కెన్ని కష్టములు కలుగుచున్నవి! ఇప్పటికైనను వీనిని వీని స్వగ్రామమునకు బంపుటమంచి దనెను. దీనిని వినుచున్న చక్రవర్తి మామగారు నే నింటికే బోవుచుంటిని కాని నన్ను రక్షకభటు లిచ్చటికి దీసుకొని వచ్చిరని బిగ్గరగానేడ్చుచు చెప్పెను.

చక్రవర్తియొక్క జ్వరము తగ్గలేదు. రాత్రియంతయు చక్రవర్తి తన్ను తాను దెలియకుండ పడియుండెను. అప్పుడు భిషంబరొక వైద్యునిని దెచ్చెను. చక్రవర్తి కనులు విప్పి యిటునటు జూచి "మామగారూ! మా బడికి సెలవ లిచ్చినారా" యని యడిగెను ఆ మాటలు విన్నప్పుడు భిషంబరు కనులనుండి బాష్పబిందువులు రాలెను. కావున వానినిదుడుచుకొని రాత్రియంతయు చక్రవర్తి యొద్ద నే యాతడు కూర్చొని యుండెను. అట్లా దినము గడచి పోయెను. మరుసటిదినము చక్రవర్తికి కొంచెము తెలివి వచ్చెను. అప్పు డాతడు నలుదెసలు జూచి యొక వేడినిట్టూర్పును విడిచెను. భిషంబరు వాని తలంపును గ్రహించి "నాయనా, మీ తల్లికి వర్తమాన మంపితిన"ని యాతడు చెప్పెను. ఆదినము గూడ గడచెను. పిల్లవాడు మిక్కిలి యపాయకరమగు స్థితిలో నున్నా డని వైద్యుడు భిషంబరుతో జెప్పెను.

తరువాత కొంత సేపటికి చక్రవర్తి తల్లి యాత డున్న గదిలోనికి బహుువేగముగ వచ్చెను. పిల్లవాని దుస్థితి జూచి యాయమ మిక్కిలి దుఃఖించెను. చక్రవర్తి తన తల్లి నొక ముహూర్తమాత్రము జూచి "ఆ" యని యనెను. అంతట చక్రవర్తిని యామె తిరిగిమాట్లాడించెను. అప్పుడాతడు "అమ్మా, మాబడికి సెలవు లిచ్చినారా" యని యాతడడిగెను.

# క లి పా దు డు

## I

భవాని కులీనవంశమందు జనన మందెను. అభయచరణు డీయన తండ్రి. అభయచరణుడు రెండువివాహములను జేసికొనెను. మొదటి వివాహమునకు శ్యామచరణుడను కొడుకు గలిగెను. రెండవవివాహ మభయచరణుడు చేసికొనునప్పటి కాయనకు చాల సంవత్సరములు గడచిపోయెను అందుచేత అభయచరణుని మామగారు తన కూతురి కేవిధమైన యిబ్బందియు గలుగకుండునట్లు తన యల్లునిచేత కొంత పొల మామె పేర వ్రాయించుకొనెను.

భవాని జనన మొందిన కొలదికాలమునకే అభయచరణుడు మృతిబొందెను. శ్యామచరణుడు పెద్దవాడయ్యెను. ఆతని కొడుకు భవాని కన్న నొక సంవత్సరము పెద్దవాడు. కావున శ్యామచరణుడు తన కొడుకును, భవానిని సమాన వాత్సల్యముతో పెంచుచుండెను. అట్లు చేయుటలో శ్యామచరణుడు తన తల్లి డబ్బు నొక కాసైనను ముట్టుకొనకుండెను. ప్రతిసంవత్సరమును తాను జేసిన ఖర్చును, వచ్చిన యాదాయమును యామెకు జూపి యామెవలన నొక రశీదు బుచ్చుకొను

చుండెను. దీని నంతయు నాయూరిలోనివారు జూచి యాతని మాతృభక్తిని, సత్యసంధతకును యబ్బురపడుచుండిరి. వ్రజ సుందరిగూడ ప్రతిసారియు లెక్కజూప నవసరములేదని చెప్పినను యాతడు మాత్రము మామూలుగ లెక్కలను జూపుచునే యుండెను.

శ్యామచరణుడు పిల్లలను సంరక్షణ చేయుటయందు దారి తేరినవాడైనను భవానిని పెంచుటలో తన కొడుకులకన్న నెక్కువ స్వాతంత్ర్యమిచ్చెను. అందుచేత శ్యామచరణుడు తన కుమారులకన్న తన మారుతల్లియొక్క కొడుకులయందే ప్రేమగలవాడై యుండెనని యూరిలోనివా రందరను కొనుచుండిరి. భవాని బాగ విద్యనేర్చుకొని యుండలేదు. కావున తన భాగమునకు వచ్చిన పొలమును జూచుటకు శ్యామచరణుని మీదనే యాధారపడవలసి యుండెను.

పత్రములమీద యొకానొకప్పుడు లోనిసంగతులను సరిగ గ్రహించకుండగనే భవాని సంతకము చేయుచుండును. కాని శ్యామచరణుని కొడుకగు "తరపాదు" డట్టివాడు కాడు. పొలములోని వ్యవహారములలో తన తండ్రి కాతడెంతయు సాయము చేయుచుండును. స్వయముగగూడ నాతడన్నిపను లను నిర్వహించుకొనుటయందు సామర్థ్యముగలిగియుండెను. ఇట్టి

సమయములో శ్యామచరణుడు మరణించెను. తరపాదునకు భవానితో కలిసియుండుట కిష్టము లేదు, కావున నొకదినమున నాతడు భవానితో వారు కలసి యుండుట సమంజసము గాద నియు యేసమయమున నైనను పోట్లాటవచ్చుననియు అందుచేత వారికి గల సహజవాత్సల్యమునకు భంగము వాటిల్లుననియు చెప్పెను.

తనవ్యవహారము లన్నియు తాను స్వయముగ జూచు కొనుకాల మెన్నడైన వచ్చునని భవాని కలలోగూడ దలచి యెరుగడు. కావున వేరుపడుట భావ్యముగాదని తరపాదుతో భవాని యనేకవిధముల చెప్పెనుగాని, ఫలము లేకపోయెను. అంత టాతడు పొలములో భాగ మెట్లు కుదురునా యని మిక్కిలి యోచింపసాగెను. అది తరపాదు గ్రహించి తన తాత పొలముల నెట్లు విభాగించినదియు యాతనికి జెప్పెను. దానికి భవాని సంతృప్తినందెను. తరువాత యింటివిషయమై యాతడు తరపాదుతో సంప్రదించెను. దానిలో గూడ నాతని కెక్కువ కష్టముకలుగ లేదు. ఏలనన తరపాదు వారికి గల రెండిండ్లలో నేయింటిలో నైన యుండుట కిష్టపడెను. దీనికి భవాని పరమా నందభరితుడై సరగమును తనతల్లికి చెప్పెను.

ఆమె తరపాదు దలంచిన దుష్టమార్గమునకు చింతించి తరుపాదుడు విభాగించిన పోలమున కన్న తన భర్త వ్రాసిన మరణశాసనము (ఉయిలు) ప్రకారము తమ కెక్కువ భాగము రావలెనని తన కొడుకుతో జెప్పి యా కాగితమును చూచుటకై తన పెట్టెను తెరచెను. కాని కాగిత మందు గన్పించ లేదు. వ్రజసుందరి నిశ్చేష్టితురా లయ్యె.

ఈ వ్యవహారములో తనకు సాయముచేయుడని పలువుర నామె ప్రార్థించెను. ఎవ్వరు నా దీనురాలిని కాపాడువారు లేరు. తుదకు "బగాలను" నాత డామెకు సహాయము చేయుట కిష్ట పడెను. బగాలను నతడు వ్రజసుందరియొక్క పురోహితుని బిడ్డడు. తండ్రి వైదికవృత్తిలో నుండినను కొడుకు కిట్టి వ్యవహారములలో దిరుగుచుండువాడు. ఉయిలుపోయినను భవానికి తరపాదుతో సమానభాగము వచ్చునని యాతడు వ్రజసుందరితో జెప్పెను. భవానితో వైరమును బెంచుచున్న తరపాదు డాసమయమున నొక దస్తావేజును దెచ్చెను. దాని ప్రకారము భవాని యాస్తి కేవిధమునను బాధ్యుడు గాడు.

భవాని బగాలును నమ్మి వ్యాజ్యములోనికి దిగెను. వ్యాజ్యము ముగియునప్పటికి భవానియొద్దనున్న ధన మంతయు పూర్తిగా ఖర్చుపడిపోయెను. పిత్రార్జితమగు యాస్తి తన వైరుల

చేతులలో నుండెను. తల్లిపేరనున్న పొలమునుండి వచ్చు ఆదాయము వారి కుటుంబసంరక్షణమునకు చాలిచాలకుండ నుండెను. తరవాత దాయూరినుండి మరియొకయూరునకు బోయెను. అప్పటినుండియు భవాని వానిని తిరిగిచూచియుండలేదు.

## II

ఈ ద్రోహ మా వితంతువును బాణములకన్న నెక్కువగ బాధింపజొచ్చెను. ఆమె బ్రతికినంత కాలమును నిట్టూర్పులు విడచుచు సత్యయకార్యమును దైవము సహింపడని పలుమారామె తన కొడుకుతో చెప్పుచుండెను. మరియొకప్పు డామె భవానిని జూచి "బిడ్డా! నాకు మీ శాసనముల్ను కచేరీలు అంత బాగుగా దెలియవుగాని నాభర్తచే వ్రాయబడిన కాగితములను నీవు తప్పక కనుగొందువని" చెప్పెను.

భవానికి ప్రపంచానుభవము చాల తక్కువకాబట్టి తన మాతృవాక్య మనృతముగాదని యాతడు గట్టిగ నమ్మియుండెను. ఈసమయముననే యాతని దురదృష్టవశమున వాని తల్లి మృతిబొందెను. కాలము గడచినకొలదియు భవానియొక్క యార్థికస్థితి దుర్భర మయ్యెను. కాని దాని నాత డేమియు లక్ష్యము సేయలేదు. జీవయాత్రావశ్యక విషయములును, కుటుంబగౌరవమును

ఆతని నెక్కువగ బాధించలేదు. అతని యమూల్యంబులగు దుస్తులు కాలక్రమమున చినిగిపోయెను. అందుచేత నాతడు సామాన్యపుదుస్తులనే ధరించవలసినవా డాయెను. అప్పు డట్టి నీచదశ కలిగినను: మున్ముందు తన కపరిమితమగు యశస్సంపదలు రానున్నవని యాతడు నమ్మియుండెను.

ముందు రానున్న సంపదలయందలి యభిలాషచే ప్రస్తుత మాత్రనికి గలిగియున్న దైన్యస్థితి యాతని నంత బాధించ లేదు. ఇట్టి స్థితిగతులనుగూర్చి యాతడు పలుమారు తన సేవకుడగు "నోటో"తో చెప్పుచుండెను. ఒక్కొకసారి యాతడు కలకత్తా నుండి నాటకసమాజములవారిని తనయూరికి రప్పించి వారిచే నాటకములను ప్రదర్శింపచేయుచును. ఇట్టి యాలోచనలకు ఓటో యిష్టపడకపోయిన యెడల వాని నాతడు దూషించుచుండెను.

తనకున్న సంపద లన్నియు యెవరిపాలగునో యని భవాని చింతించుచుండగా నాతని కొక కొడుకు గల్గెను. జ్యోతిష శాస్త్రజ్ఞులెల్ల రాపిల్లవానికి నష్టమైన యా స్తియంతయు వచ్చు నని జెప్పిరి. తన పుత్రుడు జన్మించినప్పటినుండియు భవాని స్వభా వము మారెను. దారిద్ర్య మనుభవించుట మిక్కిలి కష్టమని యాతని కప్పుడు దోచెను. తన పుత్రుని జననకాలమహోత్సవము తన వంశగౌరవమునకు తగినట్లు జేయలేదని యాతడు మిగుల

చింతించెను. తన బిడ్డను తానే మోసపుచ్చుచుంటినని యాతఁ డనుకొనెను. ఇట్టి యూహలతోడనే తనకొడుకు నాతఁడు చెడఁ గొట్టెను.

భవాని భార్య సుగుణసంపన్నురాలు. ఆమె తన భర్త వంటి స్వభావము గలదికాదు. ఆమె పేరు రష్మిని. తారు మాఱైన పూర్వవంశ గౌరవములను గురించి యామెయెప్పుడు ననుకొను నదిగాదు. ఈసంగతి భవానికి గూడ తెలియును. నీచవంశసంభూతురాలగుటచే యామె కట్టి యాలోచన లేదని భవాని మిగుల చింతించెను. దీనినంతయు నామెలక్ష్యము సేయక బాలునియొక్క పురోభివృద్ధికి మిగుల కష్టపడు చుండెను.

ఊరిలోని వారందరితోను భవాని తాను పోగొట్టుకొన్న ఉయిలును గురించి యెప్పుడును సంభాషించెడివాఁడుగాని తన భార్యతో మాత్రి మావిషయమై ప్రస్తాపించియే యుండలేదు. ఒకటిఁ రెండు సారులట్టి ప్రస్తావన నాతఁడు దెచ్చినను రష్మిని విముఖురాలుగా నుండుటచే నాతఁడేమిచెప్పుటకును యవకాశము లభించలేదు. ఆమె వారికుటుంబముయొక్క పూర్వోన్నత్యమును గురించిగాని, రాబోవు సంపదలను గూర్చిగాని యేమియు దలంచక ప్రస్తుతము కావలసినవానినిగూర్చి బహుసమర్థతతో మెలంగుచుండెను. ఇంటిలోనివారు పనిచేయుట తమకు గౌరవ

భంగమని తలంచుటచే నన్నిపనులు రష్మినియే చేసుకొనుచుండెను, కావున కాపురమును నిర్వహించుకొనవలసిన బాధ్యత యామెపై బడెను. ఇంతియేగాక భూమికి సంబంధించిన లెక్కల నామెయే చక్కగానుంచవలసి వచ్చెను. అద్దెలన్నియు నామెవసూలుచేయు చుండెను. భవానియొక్క భూములంతకుముం దెవరును రష్మి ని జూచినట్లు చూచి యుండలేదు. తన బాకీలను భవాని వసూలు చేసుకొనలేక పోయెను. బాకినుండి యొక కాసయినను రష్మిని తగ్గించునది కాదు. పొలములను బాగుచేయు వ్యవసాయదారులును, యితరులును ఆమెను నీచవంశజురాలని నిందించెడివారు. భవానికూడ నామెను జూచి తన వంశమున కట్టి హీనబుద్ధిచే నపకీర్తిని దెచ్చుచున్నదని తలంచెను. వీనినెల్లను సహించి రష్మిని తాను హీనవంశజురాల ననియే యొప్పుకొనెను.

తాను గట్టుకొన్నచీరెయొక్క చెరగును గట్టిగా నడుమునకు గట్టుకొని యింటిలోనివారును బయటివారును యేమిః యని నను లెక్కసేయక మామూలుగ తానుచేయవలసిన పనులనన్నిటిని యమితోత్సాహముతో జేయుచుండెను. కానియామెపనిలో జోక్యము గలుగజేసుకొనుట కెవరును సాహసింపరయిరి. తనకు సాయమును జేయుమని తనభర్త నెన్నడునామెయడిగెడిది కాదు. ఆయన యెక్కడ యేపని జేయవలసివచ్చునో యని

యూమె భయపడు చుండెడిది. పనినంతయు రష్మిని చేయుచుం డుటచే భవాని సోమరివాడై యుండెను. అతడు మొదటి నుండియు యేట్టిజీవితమున కలవాటుబడియుండుటచే సన్నిపనులు రష్మినియే చూడవలసి వచ్చెను. బగాలు మొదలగువారినుండి తనజీవితేశ్వరుని రక్షించుటకు సదయ హృదయముతో నామె ప్రియత్నము చేయుచుండెను. అందుచేత రష్మినివారితో మో మాటములేక కఠినముగ మాటాడు చుండెను. ఈ కారణమున నామెను జూచినప్పుడెల్ల భవాని స్నేహితులుగూడ భయపడెడి వారు. సాధారణముగ నుండు స్త్రీలవలె నామె పురుషులకంట బడకుండ వారితో సరి సమానముగ మాటాడకుండ నుండునట్టి పరిస్థితు లామెకులేవు కావున నా ధీరోదాత్తురాలీమార్గ మవలం బింప వలసివచ్చెను.

తనకు సంబంధించిన విషయములలోనెల్ల భవాని తన భార్య యిష్టప్రికారము బోవుచుండెను. కాని తనకొడుకును గురించి యోచించునపుడు మాత్ర మామె యోచనలతో నేకీభ వించువాడు మాత్రము కాడు. ఏలనన రష్మిని తనముద్దుబిడ్డ డగు కలిపాదుని భవాని యిష్టప్రకారము పెంచుటకు సమ్మతింప దాయెను.

ఒక్కొక్కవేళ తనభర్తయొక్క పూర్వపు సంపదయు, ప్రస్తుత దీనస్థితియు దలచి యామె మిక్కిలి చింతించుచుండెను. ఐనను తనభర్త యలవాటు పడియున్న సౌఖ్యముల నామె యెన్నడు నాతనికి లేకుండ జేయలేదు. ఇంటిలోని పరిస్థితు లెట్లున్నను, తనకెట్టి యాపదలు వాటిల్లినను, పసిబిడ్డ డగు కలిపాదున కేమిగావలసియున్నను, పాటింపక తన భర్తకు సర్వసౌఖ్యములను సమకూర్చుచుండెను. ఆమె భవానివిషయములో దప్ప మిగిలిన ఖర్చుల నన్నింటిని బాగుగ తగ్గించెను. ఇంటిలో నేమైన లేకుండినయెడల భవాని కామె తెలియకుండు నట్లు జేయును. భవానికి భోజనములో నేమైన తక్కువైన యెడల యా నేర మామెపై యారోపించుకొనును. తన భర్త నిట్టి గౌరవముతో జూచిన రష్మిని తన కుమారు నట్లు జూచె డిదికాదు. వానికి భోజనపదార్థములలోగూడ కావలసినవాని కన్న నెక్కువవేయునదికాదు. చలికాలములో కలిపాదున కొక దుప్పటిమాత్రము గప్పుచుండెను. ఒకానొకప్పుడా రష్మిని తన బిడ్డకు చదువుచెప్పునట్టి యుపాధ్యాయుని బిలచి వానితో తన కొమరు డెప్పుడైన పాఠములను చక్కగ చదువకబోయిన యెడల కనికర మేమాత్రము జూపకుండ శిక్షించుమని యాత నికి జెప్పును. ఇట్టిమాటలను భవాని విని సహించలేడు. కాని

తన భార్యతో తాను సాహసించి యేమియు జెప్ప లేదు. కావున నాత డామె నేమియు నన లేకుండెను.

పండుగదినములలో రష్మిని తన బిడ్డకు వేయునట్టి దుస్తులను భవానీచరణుడుచ్ఛస్థితిలో నున్నప్పు డాతని సేవకులుగూడ ధరించువారుకారు. కావున నా సంగతి రష్మిని గ్రహించి తన భర్తతో దన కుమారున కట్టి దుస్తులను వేయుటవలన వారికేమియు గౌరవభంగముగలుగదని యెంతజెప్పినను భవానీచరణుడు విచారమును మానెడివాడు కాడు. ఒకానొకప్పుడు బిడ్డ డాడుకొనుట కాతనితల్లికొన్ని వస్తువుల నిచ్చెను. వానితో నాడుకొనుచు తన చెంతకు వచ్చిన కలిపాదుని జూచినంతనే భవానీచరణుని హృదయము బ్రద్దలగుచుండెను.

బగోలు వ్యాజ్యములో పనిజేసియుండుటచే భవానీ దరిద్రము ననుభవించుచుండినను యాతడుమాత్రము ధనవంతుడై యుండెను. అందుచేత నాత డప్పుడప్పుడు కలకత్తాకు బోయి పట్టుబట్టలు, గొడుగులు, బొమ్మలు, ఉత్తరములువ్రాయు కాగితములు మొదలగు చిత్రవస్తువుల నెన్నియో దెచ్చుచుండెడివాడు. ఈవస్తువులనెల్ల యూరిలోని పిల్ల లొకరికన్న నెక్కువగ మఱియొకరు కొనెడివారు. కలకత్తావంటి మహాపట్టణములలో

ప్రతిదినమును భోజనములో పాలతో చేసిన ఫలహారము నా కక్కర లేదు.

రష్మిని—అక్కర లేదని మీ కెవరు జెప్పిరి?

భవాని—అది మిక్కిలి అనారోగ్యమని వైద్యుడు చెప్పినాడు.

రష్మిని—వైద్యుడు జ్ఞానశూన్యుడు.

భవాని—నా కన్నముదప్ప మరేమి యవసరము లేదు. ఇవియన్నియు దినుటవలన నా కజీర్ణము కలుగుచున్నది.

రష్మిని— మీ కజీర్ణముకలిగిన ట్లేమియు నాకు గనుపడ లేదు. మీరు చిన్నప్పటినుండియు యిట్టి భోజనమునకును, ఫలహారములకును అలవాటు పడియుండ నిప్పుడు మీ కజీర్ణ మెట్లు గలిగినది.

భవానిచరణుడు తన స్వసౌఖ్యములను గోల్పోయినైనను తన ప్రియపుత్రున కాయూటవస్తువును గొనసెంచెను గాని యది యేవిధమునను సాధ్యముగా లేదు. ఏవస్తువుయొక్క ధరయెంత హెచ్చినను రష్మిని తనభర్తకు మామూలుగ జేయు ఫలహారములను, పెరుగును, పాలను తప్పక దెచ్చుచు నేయుండెను. తన భర్త తిను వస్తువులలో నేది యెప్పుడు తక్కువగునో యని రష్మిని బహుజాగ్రత్తతో జూచుచుండెను.

ఒకదినమున భవానిచరణుడు బగాలుయొక్క యింటికి బోయి చాలసేపాతనితో యనవసర ప్రసంగము గావించి తుదకు బొమ్మ మాట దెచ్చెను. అప్పుడు భవాని తనయభిమానము నంతయు విడనాడి గద్గదస్వరమున బగాలునితో నిట్లు చెప్పెను "అయ్యో! యిప్పుడు నేను మిక్కిలికష్టదశలో నున్నాను. కాబట్టి మీరీ కాశ్మీరశాలువను దీసుకొని కలిపాదునకు బొమ్మ" నిమ్మని మిక్కిలి ప్రార్థించెను. బగా లంతట శాలువను జూచి మిక్కిలి వెలగల యాశాలువకు స్వల్ప వెలగల బొమ్మ నిచ్చిన యెడల యూరిలోని వారంద రేమందురో యనియు, రష్మిని యేమనునోయని యాతడు భయపడి భవాని మాట కిష్ట పడ లేదు. కావున భవాని విచారముతో శాలువను చంకలో బెట్టుకొని పోవలసినవాడాయెను.

ప్రతిదినము కలిపాదుడు తనతండ్రిని బొమ్మను అడుగ చుండెను. దానికి భవాని యేదియో సమాధానమును చెప్పు చుండెడి వాడు. కాని యిట్లాతడు బాలుని యెన్నిదినములు సంతృప్తి పరచగలడు. అందువలన భవాని యొకదినమున తన భార్యయొద్దకు బోయి కలిపాదునకు దేహమారోగ్యముగ లేదని చెప్పెను.

రష్మిని—మీరు పొరబాటునయట్లంటిరిగాని మనబాలు డారోగ్యముగనే యున్నాడు.

భవాని—ఏమియుం దోచక దినమంతయు వాడు కూర్చుండుటను నీవు జూచుట లేదా!

రష్మిని—వాడింక యెన్నిదినము లట్లు గూర్చున్నను భయము లేదు.

తాను చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థములైనందున భవాని నిట్టూర్పువిడచి తలను సవరించుకొనుచు, వరండాలోనికి బోయి "హుక్కా" దాగుచు కూర్చుండెను. నాటినుండియు భవానిచరణుడు సరిగ భోజనముసేయక తన కాకలి యగుట లేదని తన భార్యతో జెప్పెను.

అంత రష్మిని కలిపాదుని బిలిచి వానిని బుజ్జగించి "బిట్టూ! నాచిన్ని బిడ్డా! మన యింటిలోని కష్ట సుఖము లింకను నీకుదెలియలేదా! కోరదగని వస్తువులను కోరుట నీకు భావ్యమా" యని యనెను. అప్పుడు కలిపాదుడు మూల్గుచు "ఇది యంతయు నాకు దెలియదు. బొమ్మనిచ్చెదనని నాకు నాయన చెప్పినాడు" అని యనెను.

అప్పుడు రష్మిని తన భర్త బొమ్మను కొనియిచ్చెదనని జెప్పినను దానివలన యెంతబాధ, యెంతనష్టము, యెంతప్రేమ

యునుగలదో దానినంతయు యా కసికూనకు స్పష్టముగఁ దెలియ జెప్పెను. రష్మిని యెన్నడు తన బిడ్డతో నట్లు మాట్లాడియుం డలేదు. కావున కలిపాదున కపరిమితానందము గలిగెను. పసిబాలుడైన కలిపాదుఁడు తన మాతృ హృదయవేదనను గ్రహింపగలిగెను, కాని యాటబొమ్మపై యాతనికి గలిగిన ప్రేమ మాత్రము బోలేదు. మూతి బిగించుకొని కలిపాదుడు భూమిపై వ్రాయుచుండెను. అంత రష్మిని రోషాననయై "బిడ్డా, నీవు కోర దగని వస్తువును కోరితివి. నీ వెంతయేడ్చినను, నీకెంత కోపము వచ్చినను నీకు నే నది కొనిపెట్టన" నిజెప్పి యామె యాగదిలో నుండి లేచి పోయెను.

కొంతసేపటికి కలిపాదుడుగూడ బయటికిబోయెను. అప్పటి కింకను భవాని హుక్కాను దాగుచుండెను. కలిపాదునిజూచి నంతనే యాతని కేదియో పనియుండిన ట్లైచటికో భవాని పోవుచుండెను. కలిపాదుడు పరుగెత్తుకొనుచు తనతండ్రియొద్దకు బోయి వానినిపట్టుకొని "నాకు బొమ్మను కొనిపెట్టెదవా" యని యడిగెను.

అప్పుడు భవాని పొరలి పొరలి వచ్చుచున్న దుఃఖము నాపుకొని, తన ప్రియకుమారు నెత్తుకొని ముద్దాడి "బాబా!

కొంచెము మాగుము. నాకొక పనియున్నది. పని పూర్తియయిన తోడనే నీ బొమ్మను గురించి చెప్పెద"నని యాబిడ్డనుదించి తా నింటిలోనుండి వెడలిపోయెను. అప్పుడు భవాని కనులనుండి నీటిబొట్లు పడుచుండెను కలిపాదు డది జూచెను. తన తండ్రి యెచ్చటికి బోవునో యని యాతడు వాకిటిలో నిలుచుండి చూచుచుండెను. కాని భవాని దుఃఖముచే నెటుబోవుటకును దోచక నటు నిటు దిరుగు చుండెనని యాబాలుడు గ్రహించెను. అంత కలిపాదుడు తన తల్లియొద్దకు జని "అమ్మా నాకాబొమ్మ యవసరములేదు" అని చెప్పెను.

తరువాత కొంతసేపటికి భవానిచరణుడు భోజనమునకు వచ్చెను. అతని ముఖకాంతి మిగుల దైన్యమును దెల్పు చుండెను. ఈ దినమునఁ గూడ యాతని కాకలిలేనట్లు గన్పడు చుండెను. ఆసమయమున సాధ్వియగు రష్మిని యట్టపెట్టె కొక దానికి దారముగట్టి తసభర్త యెదుట నుంచెను. దానిలోని వింతవస్తువును తన ప్రియుడు భోజనమున్నుజేసినతరువాత జూప నెంచెను. కాని మరల యోచించి యప్పుడు జూపించుటే భావ్యమనుకొని పెట్టె యొక్క మూతనుదీసిదానిలో నున్న బొమ్మను జూపించెను. భవాని మందహాస వదనుడాయెను.

ఆదినమున ప్రతి దినముకన్న యాతని కాకలి యెక్కువా యెను. పాలు ప్రతిదినముకన్న యెక్కువ రుచిగా నుండెను. అజీర్ణ మసలే పోయెను. తన ప్రేయసి చేసినపదార్థముల నాతఁ డమితముగ మెచ్చుకొనుచుండెను.

ఆదినమంతయు కలిపాదు డాబొమ్మతో తన స్నేహితుల యొద్ద నాడుకొనుచుండెను. కలిపాదున కట్టిబొమ్మ యున్నం దున కాతని స్నేహితులెల్ల రాతనిపై ద్వేషమును గలిగియుం డిరి. రష్మిని బగాలుని యొద్ద నాబొమ్మ నద్దెకు దెచ్చుటచే నది మరుసటిదిన మీయవలెను గాన కలిపాదు డా బొమ్మ నొక నిముసమేనియు విడచియుండ లేదు. మరుసటి దినమున కలిపాదు డొక నిట్టూర్పును విడచి తానిష్టయముగ నా బొమ్మను బగాలున కిచ్చి వేసెను.

అప్పటి నుండియు కలిపాదుడు తనతల్లిమాట నెన్నడు నతిక్రమించి యుండలేదు. ఆమె జేయు పనులన్నిటిలో నాతఁడు సహాయము జేయుచుండెను. ప్రతి జీవియు కష్టించి పనిజేయవ లెనని యాతఁడు గ్రహించెను.

దేశభాషలో కృతార్థుడైన పిదప తనకొడుకు యొక్క చదువును మానిపించవలయు నని భవాని తలచి యుండెను.

కాని కలిపాదుడు తనతల్లితో నీవిషయమునుగూర్చి యోచిం చెను. అంత నాసాధ్వి "బాబా! నీవు బాగుగ యోచించితివి. విద్యాభ్యాసమునకై నీవు కలకత్తాకు వెళ్ళవలెన"ని తన తనయునితో నాసాధ్వి జెప్పెను.

తనవిషయమై వారొక కాసైనను ఖర్చుపెట్టవలదనియు, అవసరమైన యెడల కలకత్తాలో తానేదైన పని జూచుకొనుచు చదువుకొందుననని యా బాలుడు తన తల్లితో జెప్పెను. తల్లి యందుల కిష్ట పడెను. కాని భవాని మాత్ర మిందులకు మొదట యిష్టపడలేదు. ఏలనన వాని పూర్వు లెవరును కలకత్తాకు వెళ్ళి విద్యనునేర్చుకొని యుండలేదు. ఐననువారందరుపేరు ప్రఖ్యాతులను గాంచగలిగిరి. కాబట్టి కలిపాదుడుగూడ తాను పుట్టి పెరిగినయూరు విడచిపెట్టి పోవుటకు భవాని కిష్టము లేదు. కాని యూరిలోని వారందరికన్న తెలివికలవాడగు బాలుకూడ కలిపాదుడు కలకత్తాకు వెళ్ళుట కిష్టపడెను. అందుచేత నాతడు భవానితో "నీకొడుకు కలకత్తాకు వెళ్ళి చదువుకొనిన యెడల కొలదికాలముననే ప్లీడరు కాగలడు. అప్పుడు మీకున్న వ్యాజ్యములనన్నిటిని నాతడు స్వయముగ జూచుకొని వ్యవహారములన్నియు చక్కగ, పరిష్కరించుకొనగలడని చెప్పెను.

అప్పుడు భవానికి గలిగిన సంతోషమునకు మేర లేదు. పాతకాగితములన్నియు దెచ్చి తన "ఉయిలు" నెట్లు హరించిన దియు ప్రతిదినమును భవాని తన కొడుకునకు జెప్పుచుండును. దానిలోని సంగతులు కలిపాదునకు బాగుగ తెలియకపోయి నను తనతండ్రి చెప్పెడు మాటలన్నియు క్రమమైనవనిమాత్ర మాతడు తలంచెను.

కలిపాదుడు కలకత్తాకు బయలుదేరుటకు క్రిందటిదిన మున వానిమెడలో రప్మ్కని యొకరక్షరెకు గట్టెను. తన కేమైన యత్యావసరమైనయెడల వాడుకొనుమని 50 రూపా యల నోటునుగూడ నొకదానినామెవానికిచ్చెను. ఎటువంటికష్ట ములువచ్చినను గూడ ఆనోటును ఖర్చుబెట్టగూడదని కలిపాదుడు నిశ్చయించుకొనెను. ఏలనన నావీరమాత తానెట్టికష్టముల ననుభవించి యానోటును సంపాదించినదియు కలిపాదునకు దెలియును.

## III

అప్పటినుండియు ఉయిలు విషయమై భవాని విశేష ముగ మాట్లాడుట మానకొనెను. కలిపాదుని విద్యను గూర్చియె యామె యెప్పుడు మాట్లాడుచుండువాడు. కలకత్తా

లోని పాఠశాలలో కలిపాదుషు ప్రవేశించి విద్యనభ్యసించుచుండెను. ఆమహాపట్టణములోని ప్రతివీధియు యాతనికి దెలియును. హుగ్లీయొద్ద గంగానదికి మరియొకవంతెన కట్టెదరను వార్త యాతనికే మొదట దెలిసెను. తన కుమారుని దగ్గర నుండి వచ్చిన యాయుత్తరమును ప్రతివారియొద్దకు దీసుకొని పోయి భవాని చదువుచుండుటచే నాటి దిన మాతనికి సులోచనములజోడును దీయుటకుగూడ వీలులేకపోయెను.

ఐన నొకయింటినుండి మరియొకయింటికి బోవునపుడు భవాని తన సులోచనములజోడును కేసులోనుండి బహు జాగ్రతగ బయటికిదీసి, తానుకట్టుకొనిన బట్టచెరగుతో సులోచనముల అద్దములను చక్కగా దుడుచుకొని తనకుమారుడు వ్రాసినయుత్తరములోని యక్షరములలో నొక్కొకదానినే బహుజాగ్రతగ యూరిలోనివారందరికి చదివి వినుపించెడివాడు.

గంగానదికి వారధిగట్టుట భవాని యుద్దేశ్యప్రకారము దేశమున కనర్థదాయకమైనను, అట్టివార్తను మొట్టమొదట తనకొడుకే వ్రాయుటచే దానిని యూరిలోనివారందరికి తెలియ జేయుటయందాతడెంతయు శ్రద్ధవహించెను. తనకు గనుపించినవారితో నెల్లను కొలదిరోజులలోనే గంగామహాదేవి

గూడ నీభూలోకమునుండి మాయమై పోగలదనియు యట్టి వార్తనుగూడ నాతని కుమారుడే మొదట తనకు వ్రాయునని యాతడు తలంచెను.

బహుప్రయాసతో కలిపాదుడు తాను సంపాదించిన ధనముతో మెట్రికుృలేషను పరీక్షలో కృతార్థుడాయెను. దానిలోగూడ నాతనికి జీతములేదు. ఇట్టి సంతోషవార్త భవానికి దెలిసినంతనే యూరిలోనివారందరి కొకవిందును జేయ నిశ్చయించుకొనెను. గాని యందులకు రష్మినిసమ్మతింప లేదు.

కలిపాదుడు చదువుకొనుచున్న కళాశాలకు సమీపమున నొకయింటియందు విద్యార్థులనేకులు కాపురముండిరి. ఆయింటి యజమాని కలిపాదుడు తనకుమారునకు విద్యను నేర్పుటచే వానికి తనయింట భోజనమిడి యొకగదిని చదువుకొనుటకిచ్చెను. కలిపాదుడు చదువుకొను గదిలోనికి మంచిగాలి రాకపోయినను, అతని చదువున కితరవిద్యార్థులవలన నేమియు భంగముగలిగెడిదికాదు. మేడమీద అద్దెకుండిన విద్యార్థులకును, కలిపాదున కేమియు సంబంధము లేదు. ఐనను పైనుండు విద్యార్థులు సాధారణముగ

అల్లరిచేసెడివారు. వారి నాయకుడు సైలెను. "సైలెను" కులీన వంశ సంభవుడు. ఆతడు విద్యార్థులున్న యింటిలో నుండు టనవసరము కాని యాతనికి స్నేహితులన్న యపరిమితమగు సంతోషము. విద్యార్థులున్న గృహమున నే తానున్న యెడల తన కోరిక కెట్టిభంగమును గలుగదని సైలెను తలంచియుండెను. తాను మంచివాడనని సైలెనుయొక్క యభిప్రాయము. దానికి నిదర్శన మనవసరము. సైలెనుకు విశేషముగ చేతిలో ధన ముండెను. ఎవ్వరైననాపదలోనున్న యెడల వారికి దగిన సహాయమును జేసి సైలెను తన యుదారస్వభావమును వెల్ల డించుకొనుచుండెను. కష్టదశలో నున్న వారెవ్వరైనను తన సహాయమును కోరనియెడల వారికి గలిగిన యిక్కట్టుల నింకను యెక్కువజేయుటకు సైలెను ప్రయత్నము జేయును.

ఊరిలో నాటకమున్న యెడల తన స్నేహితుల కందరికిని టిక్కెట్టును సైలెనే తనడబ్బును ఖర్చుచేసి కొనితెచ్చును. వారందరు నాటకప్రదర్శనమును గాంచి సంతోషమును బొందెడివారు. ఆతడు చేసెడి విందులకిక లెక్కలేదు. ఎవరి కైనను డబ్బుకావలసినయెడల తిరిగి యివ్వకుండగనే సైలెను బదులిచ్చెడివాడు. కొత్తగా వివాహముచేసికొనిన వారెవ

నైన తన భార్య కొకబహుమాన మీయదలచిన యెడల వారు సైలెసును బజారునకు బిలుచుకొని పోయెదరు. అప్పుడు వారొక పాడువస్తువును బేరము చేసిన యెడల సైలెసు వెంటనే పట్టణములోనున్న వస్తువులన్నిటికన్న మంచివస్తువును బేరము చేయును. ఖరీదు తెలిసినవెంటనే వాని స్నేహితు లూర కున్న యెడల తా నావస్తువును గొని తన స్నేహితుల కిచ్చును. ఈవిధముగ మేడపైనున్న విద్యార్థులందరికిని సైలెసు పోషకుడుగా నుండెను. ఇంతయేల? ఇతరుల కెల్లవేళలను సహాయమును జేయుటయే యాతనికి పరమసంతోషము.

కలిపాదు డాగాలిలేనిగదిలో మురికిచాపపై గూర్చుండి పాఠములను వల్లించుకొనుచుండెను. మరుసటిసంవత్సరముకూడ జీతము లేకుండ టాతని కత్యవసరమైయుండెను. తా నింటినుండి కలకత్తాకు బయలుదేరునపుడు వానితల్లియగురిమ్మని ధనవంతు లగుపడుచుపిల్లవాండ్రతో వానిని స్నేహము చేయవద్దని చెప్పియుండెను. కావున కలిపాదు డట్లే నేటికిని ప్రవర్తించుచుండెను. కలిపాదంతటి పేదవాడు తనపోషణకు పాత్రుడుగానుండుట యాతనికి గల గర్వమని సైలెసు భావించెను. ఇంతియగాక యాతని భోజనములోను, దుస్తులలోను, అన్ని విషయములలోను

సైలెనునకు కలిపాదునియొక్క నిరుపేదత్వము తెలియుచుండెను. ఇది సైలెనునకెంతయో కష్టముగనుండెను. చినిగిపోయిన దుస్తులను, పక్కబట్టలను, గాలి యేవిధమునను ప్రవేశించుటకు వీలులేని యాగదియు వీని నన్నిటిని జూచుటకు సైలెనునకు భయముబుట్టుచుండెను. అన్నిటికన్న కలిపాదుని మెడలో రక్షరేకొకటి కట్టబడియుండెను. దానికి ప్రతిదిన మాతడు మిక్కిలి భక్తితో పూజచేయుచుండెను. ఇది సైలెనునకు మరింత వినోదమును గల్గించుచుండెను.

ఒకదినమున సైలెను, వానిస్నేహితులును కలిపాదుని విందునకు రమ్మనిపిలచిరి. కాని యావిందునకు కలిపాదుడు పోలేదు. సైలెనుచే పిలువబడినవారెవ రాతని నిట్లు తిరస్కరించియుండలేదు. కావున యాతనికి కలిపాదునిపై యపారమగు యీర్ష్య కలిగెను. కొన్నిదినములైనతరువాత మేడమీద యల్లరి యెక్కువగనుండెను. కలిపాదుడు పాఠములను చదువుకొనుటకు వీలులేకపోయెను. కాబట్టి కలిపాదుడు తెల్లవారుజామున పార్కులో తనపాఠములను జదువుకొనుచుండెను. మనోవేదనచేతను, గాలిరానిగదిలో నుండుటచేతను, తినుట కన్నము సరియైనది లేకపోవుటచేతను కలిపాదుడు దుర్భరమగు తల

నొప్పిచేత బాధపడుచుండెను. బాధ యెక్కువైనపుడు మూడు నాలుగుదినములుగూడ సాగదియందే కలిపాదుడు పండుకొని యుండువాడు. తనతండ్రికి వ్రాసెడి యుత్తరములో నీవిషయమై యేమియు వ్రాసెడివాడుకాడు. మేడపైన చేసెడి యల్లరిగూడ యాతని వ్యాధి నింక నెక్కువజేసెను. తన స్నేహితులతో నాతడు తగుమాత్రముగ మాట్లాడుచు విస్తారము వారిదృష్టిపథ మునుండి తప్పించుకొనుచుండెను. ఈవిధమున నుండినను గూడ యాతని కష్టములు దీరలేదు.

ఒకదినమున యాతనిగదిలో పాతచెప్పులకు బదులు క్రొత్తచెప్పులుండెను. ఆక్రొత్తచెప్పుల నాతడు కళాశాలకు వేసుకొనిపోవుట కిష్టపడక బజారులో చెప్పులమ్మువానియొద్దకు బోయిమరియొక పాతజోడును ఖరీదునకుదీసుకొని దానితో నాతడు కళాశాలకుబోయెను. తనచెప్పులు బోయినవని యాతడెవరితోడను చెప్పియుండలేదు. ఎవ్వరి నేమియు ననలేదు. ఇట్లు కొంతకాలము గడచెను.

మరియొకదినమున నొక విద్యార్థి కలిపాదుడున్న గది లోనికి వచ్చి వానితో నిట్లుసంభాషించెను.

విద్యార్థి:—పొరబాటున నా వెండి సిగరెటుపెట్టెను

నీవు దెచ్చినావా? కలిపాదుడు డామాట కెంతయు కోపముగలవాడైయిట్లు ప్రత్యుత్తరమిచ్చెను "నే నీకలకత్తాకు వచ్చినప్పటినుండి యిూగదిలోనికి రాలేదు గదా. నన్ను నీవిట్లనుట భావ్యమా! ఈమాట లావిద్యార్థి విని కొంచె మటునిటుజూచి ఓహో! యిదిగో సిగరెటుపెట్టె యిచ్చట నున్నదని" యాత డాగదిలో నొకమూలనున్న వెండిసిగరెటు కేసును దీసుకొనెను.

ఇంటర్ మీడియటు ప్యాసయినవెంటనే యాతడాగదిని వదలిపెట్టుటకు నిశ్చయించుకొనెను. ప్రతిసంవత్సరము విద్యార్థులందరు నాయింటిలో సరస్వతీపూజను జేయుచుండిరి. గడచిన సంవత్సరము కలిపాదునివలన నాయింటిలోని విద్యార్థులు చందానేమియు పుచ్చుకొనలేదు. ఈసంవత్సరముమాత్రము కలిపాదుని కొంత బాధపెట్టుటకు చందాపుస్తకమును దీసుకొని కొందరు విద్యార్థు లాతనిగదిలోనికి వెళ్ళిరి. తాను పూజలో పాల్గొనుట కిష్టములేకున్ననుకలిపాదుడు ఐదురూపాయల చందా వేసెను. వానియొక్క దుర్భరమగు పేదతనమునుగూర్చి యింత వరకు వారాతని నసహ్యించుకొనుటచే కలిపాదుడు చందాకు నిచ్చిన ఐదురూపాయిలను జూచి సహించలేరైరి. పాపము! కలిపాదు డీచందా నిచ్చినందువలన మునుపటికన్న తాను శరీర

సౌఖ్యమును గోల్పోవవలసినవాడయ్యెను. అతడు చేయు భోజనమున కొకవేళ లేకుండెను. సరియగు వేళకు భోజనమును పెట్టుమని యెవరినైన నాయింటిలోనివారి నడుగుటకతని కధికారము లేదు. పనిజేయువారు దెచ్చినవస్తువులతో నాతడు సంతృప్తిపడవలెను. కాని తనభోజనములోని కిట్టివస్తువు లుండవలెనని యాత డడిగినందువలన నేమియు ప్రయోజనముండదు గాన యాతడట్టి యాశ నెప్పుడు బెట్టుకొని యుండలేదు. కావున ప్రతినెలలోను తాను 4, 5రూపాయలతో తనకు గావలసిన వస్తువులను కొని కొంతవరకుసుఖముగ జీవనమునుచేసెడివాడు. కాని యీనెలలో 5 రూపాయిల చందా నిచ్చుటచే నాతనికట్టి యవకాశముగూడ లేకపోయెను. కావునయాతనితలనొప్పి మరింత యెక్కువాయెను. అతడాసంవత్సరము పరీక్షలో ప్యాసయినను స్కాలరుషిప్పు మాత్రము రాలేదు.

అందుచేత కలిపాదుడు మునుపు తానున్న గదియందే యుండవలసిన వాడాయెను. స్కాలరుషిప్పు లేకపోవుటచే నాతడు మరికొందరికి చదువుచెప్పి డబ్బు సంపాదించుకొనవలసి యుండెను. పైనున్న విద్యార్థులెల్లరు కలిపదు డీసంవత్సరము తనగదిని ఖాళిచేయునని తలచియుండిరి. కాని కళాశాల పెట్టు

దినమునకు సరిగ నాతఁడు తనసామానులుబట్టలతో తనగది యొక్క తాళమునుదీసెను. స్టేషనునుంచి యాతఁ డొకకూలివానితో తన పెట్టెను, మరి యితరసామానులను దెప్పించుకొనెను. ఆకూలివాఁడు సామానంతయు కలిపాదుని గదిలోఁబెట్టి తనకీయ వలసిన డబ్బు నడిగెను. అందుచేత కలిపాదుఁడాకూలివానితో గొంతసేపు పోట్లాడి తుదకు వానిని బంపివేసెను.

కలిపాదు డింటినుండి దెచ్చిన సామానులలో కొన్ని యూరగాయలును పచ్చళ్ళును గలవు. వీని నన్నియు రష్మిని తన కుమారు డిబ్బందిపడకుండ నుండుటకు ప్రత్యేకముగ జేసి పంపెను. తాను లేనిసమయమున మేడమీఁదనున్న విద్యార్థులు తనగదిలోనికి వచ్చిచూచెదరేమో? యని వాని నన్నింటిని కలిపాదుఁడు బహుజాగ్రతగ దాచియుంచెను. తనతల్లిచేస్వయముగ చేయబడిన పదార్థములుగాన వానిపై కలిపాదున కపరిమితమగు యభిమాన ముండెను. కాని హీనస్వభావముగల మేడపైనున్న విద్యార్థు లివన్నియు జూచి పల్లెటూరివాని చేష్టలని వానిని పరిహసించుచుండిరి. ఈ యూరగాయలన్నియు మట్టిపాత్రలలో నుండుటచే బస్తీలోనివారు వీనిని జూచి పరిహసించుటకు మరింత యవకాశ ముండెను.

కలిపాదుడు తాను రెండు,మూడునిముసములు బయటకు బోయినను గదికి తాళము వేయుచుండెను. చూచుట కసహ్యామైన యాగదిని తానంత జాగ్రతగ తాళము వేయుటచే మేడ మీదనున్న విద్యార్థులకు మరింత కోపమువచ్చెను. అందుచేత సైలెను తన ప్రియస్నేహితులనుజూచి వానిగదిలో నేమున్నదో చూచి రమ్మనిచెప్పెను. ఇది వారికందరికిని మిక్కిలి సంతోషమాయెను.

కలిపాదుడు తనగదికి వేసిన తాళమంత మంచిదిగాదు. అది యేతాళపుచెవికైనను వచ్చును. కాబట్టి కలిపాదుడు పిల్లలకు వారియింటియొద్ద చదువుచెప్పుటకు వెళ్లినపు డామేడ మీదనున్న విద్యార్థులలో నిద్దరు, ముగ్గురు లాంతరును దీసుకొని కలిపాదునియొక్క గదితాళమును మార్పుతాళము చెవితో దీసి లోనప్రవేశించిరి. పక్కచుట్టు దీసి చూడగనే వారికి కలిపాదుడు తనయూరినుండి తెచ్చుకొన్న పచ్చళ్ళు గానుపించెను. వాటిని కలిపాదు డంత జాగ్రతగ నేల దాచి యుంచవలెనని వారు కొంతసేపు యోచించిరి. తరువాత వారాతని ట్రంకుపెట్టెను దీసిచూచిరి. అందులోమాసిన గుడ్డలును పుస్తకములుండెను. వానిని జూచుటచే వారి మనసువిసికి

పెట్టెను మూసివేయబోవుచుండిరి. ఆసమయముననే వారికా పెట్టెలో నొకమూల మాసినరుమాలున గట్టబడిన మూట యొకటి గానుపించెను. వారు దానిని విప్పి యందులోని 50 రూపాయల నోటును జూచి నవ్వుకొనుచుండిరి. ఇంతలో వారికి ద్వారమునుండి మనిషియడుగుల చప్పుడు వినవచ్చెను. అందు చేత వారందరు మేడమీదికి 50 రూపాయల నోటును దీసుకొని పరుగెత్తిరి. తనస్నేహితులు 50రూపాయలనోటును తనకు జూపి నప్పుడుసైలెనాశ్చర్యపడెను. ఏలనన కలిపాదుడు 50 రూపాయలుతనపెట్టెలో దాచియుంచునని యాత డెప్పుడనుకొని యుండలేదు. తరువాత కలిపాదు డేమిచేయునో చూడవలెనని వారెల్లరు కనిపెట్టుకొనియుండిరి.

కలిపాదు డానాటిరాత్రి తనగదిలోనికి వచ్చినపుడు తలనొప్పిబాధ యెక్కువగానుండుటచే తనగదిలోని వస్తువుల నేమియు జూచుకొనకనే పరుండి నిద్రబోయెను. మరునాటియుదయముననే యాతడు తనప్రక్కచుట్టను దీసి ట్రంకుపెట్టెను జూచునప్పటికి దాని తాళము దీసియుండెను. ఒకవేళ పొరబాటున తాను తాళము పెట్టెకు వేయుట మరచియుండవచ్చునని యూహించెను. పెట్టెలో జూచునప్పటి కందులోని

వస్తువు లెల్ల నటునిటు పడవేసియుండెను. ఇది యాతనికి కొంత భీతిగలిగించెను. పెట్టెలో తనప్రియజనని తనకిచ్చిననోటు గనుపించనప్పు డాతనికి గలిగిన మనోవేదన వర్ణనాతీతమై యుండెను. అప్పు డానోటు పోయినదని యాతనికి గట్టిగా నమ్మకము లేకపోవుటచే పెట్టె నంతయు మూడునాలుగు సారులు వెదకి యప్పటికిని యానోటు తనకు గనుపించకపోవుటచే నాతని కేమియును దోచక తన ప్రక్కమీద కొంతవరకు నిశ్చేష్టితుడై పడి యుండెను.

అప్పుడాతనికి మేడమీదనున్న విద్యార్థులయొక్క యడుగులచప్పుడు వినవచ్చెను. వారప్పుడు నవ్వుచుండిరి. తన 50 రూపాయల నోటు నెవ్వరు దొంగిలించలేదనియు తన్ను పరిహాసించుటకు సైలెను తన స్నేహితులతో నాపని జేసియుండునని యాతడు నిశ్చయించుకొనెను. ఎవరైన తన నోటును దొంగిలించిన యెడల కలిపాదున కంత బాధయుండెడిది కాదు. కాని యిట్టిచెడుపనిని చేసియుండుటచే నాతనికి మరింత కష్టమాయెను. కావున నాతడప్పుడు మొదటిసారి మేడపైకి పరుగెత్తెను. కోపముతోడను, వ్యాధితోడను ఆతని ముఖ మొకవిధముగ నుండెను. ఆదిన మాదివారముగావున

సైలెను తనస్నేహితులతో నవ్వుచు మాట్లాడుచు వరండాలో కూర్చొనియుండెను. నా నోటును నాకిచ్చివేయుడని వారితో కలిపాదు డిమితకోపమున ననెను. కొంచెము శాంతముతో నడిగినయెడల వారికి జాలిగలిగి వానినోటును వానికిచ్చెడివారే కాని కలిపాదుడు కోపముతో మాటాడుటతోడనే వారు తమ కుర్చీలమీదనుండి లేచి "ఏమిటిది- మీనోటా-ఏమినోటు" అని వారంద రనిరి. "నాపెట్టెలోనుంచి మీరు తీసిననోటని" కలిపాదుడు బదులుచెప్పెను. అందుకు వారు "మేము దొంగలమని చెప్పుటకు నీవు సాహసించెదవా" యనియనిరి. ఆసమయమున కలిపాదుని చేతిలో నొక యాయుధమే యున్నయెడల వారి నందరి నాతడు చంపెడివాడె కాని యాతని చేతిలో నేమియు లేకపోవుటచే కలిపాదుడు వారినికొట్టబోయెను. అంత నావిద్యార్థులలో నలుగు రైదుగు రాతనిపై బడి వాని నీడ్చుకొనిపోయి వానిగదిలో బడవేసిరి. అంత సైలెను 100 రూపాయల నోటు నా నీచుడగు కలిపాదున కిమ్మని దనస్నేహితులతో చెప్పెను గాని వారందుల కిష్టపడలేదు. తరువాత కొంతసేపటికి వారం దరు నిద్రబోయిరి.

తెల్లవారిన తరువాత కలిపాదుని సంగతి వారు మరచి

పోయిరి. కానికొందరాతని గదిముందునుండి బోవుచుండ యాత
డేదియో మాటాడుచున్నట్లు వారికివినుపించెను. అంతనీసంగతి
వారిలో కొందరు సైలెనుకు జెప్పిరి. సైలెను కలిపాదుని గది
యొక్క తలుపు దగ్గర నిలుచుండి యాతడేమి యనుచుండెనో
యని వినెను. అప్పుడు కలిపాదుడు "తండ్రీ - తండ్రీ - తండ్రీ"
యను మాటదప్ప మరేమియు ననుచుండుటలేదు. గదితలుపుకు
లోపల కలిపాదుడు గడియవేసుకొని యుండెను. ఈ మాట
వినిన తోడనే సైలెనుకు భయముబుట్టెను. 50 రూపాయిల
నోటుబోవుటచే కలిపాదునకు పిచ్చిబుట్టినదని యాతడను
కొనెను. అంత సైలెను "కలిపాదబాబూ కలిపాదబాబూ!" యని
పెక్కుసారులు బిలచెను. కాని యెవరును పలుకలేదు. తిరిగి
యాతనికి తండ్రీ - తండ్రీ యనుమాట మాత్రము వినవచ్చుచుం
డెను. అంతట సైలెను మరింత భయపడి "కలిపాదబాబూ!
దయచేసి యొకసారి తలుపుదీయుము. మీనోటు దొరికిన"దని
తిరిగి కేకవేసెను. కాని యీసారిగూడ తలుపు నెవరును దీసి
యుండలేదు. తండ్రీ! తండ్రీ! యనుమాట మాత్రము వినవచ్చెను.

ఇట్టి దురవస్థ సంభవించునని సైలెనెన్నడును దలచి
యుండలేదు. తానుబొందిన పశ్చాత్తాపమిట్టిదని యాతడు

తన స్నేహితులకు జెప్పియుండలేదు. కాని యాతనికపరిమితముగు సంతాపము గలిగెను. కలిపాదుని యొక్క గదితలుపు పగుల గొట్టుటకు కొందరు సలహానిచ్చిరి. పోలీసు వారువచ్చుట మంచి దని మరికొందరనిరి. ఏలనన కలిపాదునకు పిచ్చిబుట్టినదనియు యాతఁడు జీవించుట మిక్కిలి దుర్లభమనియు నచటి విద్యార్థు లెల్లరు దలంచిరి. అప్పుడు సైలెను దగ్గరనున్న డాక్టరును పిలి పించెను.

డాక్టరువచ్చిన పిదప తలుపును బలవంతముగ తీసిచూడ మ నప్పటికి కలిపాదుడు స్మృతిలేని వాడై నేలమీద బడియుండెను. వైద్యుడాతనిని జూచి యాతనికచ్చట బంధువులెవరైన యుండి రాయని ప్రశ్నించెను. దానికి సైలెను తనకాసంగతి తెలియ దనియు కనుగొనుటకు సర్వవిధముల ప్రయత్నము జేసెదనని జెప్పెను. కలిపాదుని యాగదియందుండి తొలగించి పరిశుభ్రమైన మఱియొక గదిలోనుంచుట మంచిదనియు యాతఁడుజీ వించుటగూడ దుర్లభమని యా వైద్యుడనెను. సైలెను మేడ పైనున్న తనగదిలోనికి కలిపాదుని దీసుకొని పోయి తనస్నేహి తుల నందరిని యచటనుండి వెడలగొట్టెను. తరువాత సైలెను కొంత మంచుగడ్డను దెచ్చి కలిపాదుని తలపైనుంచి తాను స్వయముగ విసరుచుండెను.

తన తలిదండ్రులు వ్రాసిన యుత్తరములను కలిపాదును తన స్నేహితులకు గనపడకుండ జాగ్రత్తగ దాచియుంచెను. కాబట్టి వానియుత్తరములు సైలెనుకు వెంటనే గనుపించలేదు. అందువలన సైలెను కలిపాదునియొక్క పెట్టె తెరచిజూచెను. ఆపెట్టెలో రెండుకట్టల యుత్తరములుండెను. అందొకదానిలో భవాని వ్రాసిన యుత్తరములును మఱియొక దానిలో రష్మిని వ్రాసిన యుత్తరములు నుండెను. తలుపునకు గడియవేసి సైలెనాయుత్తరము లన్నియు జదివెను. భవాని పేరు వినునప్పటికాతని కమితాశ్చర్యము గలిగెను. అప్పుడాతడాయుత్తరములనుజూచుట మాని కలిపాదుని ముఖమువంకయొకనిముషమాత్రముజూచెను. ఇదివరకు కలిపాదునకు తనకును కొన్నిపోలిక లున్నవని తన స్నేహితులు జెప్పినమాటయాతనికప్పుడుజ్ఞపకమునకు వచ్చెను. వారామాట లనునప్పుడువాటిని నమ్మక లజ్జచే తలవంచుకొని వారియెదుటనుండి తానావలకు బోవుచుండెను. కాని నేడాయని కంతయు స్పష్టముగ దోచెను. తన తాతయగు శ్యామచరణునకు భవానియను మాఱుతమ్ముడుండెనని యాతడెరుగును. కాని తరువాత జరిగినసంగతు లాతనికి తెలియనే తెలియవు. భవానికొక కొడుకుండెనని సైలెనుకు దెలియదు. భవాని తనకు జాలిగొల్పు

నంత నీచస్థితిలో నుండెనని యాతడు కలలోగూడ దలంచి యెరుగడు. ఐనను కలిపాదు డాతని చుట్టమని చెప్పుకొనుటకు నేడు సైతెను సిగ్గుపడలేదు.

## IV

ఇదివరకు తన స్నేహితులు కలిపాదుని ప్రతిదినమును పరిహాసము జేసియుండిరిగాన యాతనిని తన గదియం దుంచుట కిష్టములేక సైతె నొక మంచి యిల్లద్దెకు దీసికొని యందులో నాతని నుంచెను. తన కొడుకు జబ్బుగా నుండెనని తెలిసి నంతనే భవాని కలకత్తాకు వెళ్ళెను. ధనము ఖర్చగునని యోచింపక కావలసినమట్టుకు బాగుగ ఖర్చుబెట్టుమని తాను కష్టపడి సంపాదించిన ధనము నంతయు రష్మిని భవానిచేతి కిచ్చెను. ఆమె కలకత్తాకు బయలుదేరి వచ్చుట వారి వంశము యొక్క గౌరవభంగము గావున తా నింటనుండి దేవతలకు మ్రొక్కుచు, తన భర్తను మాత్రమే తన కొడుకును జూచు టకు బంపవలసిన దాయెను.

భవానిచరణుడు కలకత్తాకు వచ్చినపుడు కలిపాదు డొడలు దెలియకుండగ పడియుండెను. అట్టి స్థితియందు సైతము తన పుత్రుడు తన పేరునే తలచుచుండుటచే భవాని

శోకము మరింత యెక్కువాయెను. కలిపాదు డేమియు తెలియకుండగనే తన తండ్రి ననేకసారులు పిలచుచుండెను. భవాని తనకొడుకునకు తన్ను తెలియజేసికొందమని యెంత ప్రయత్నము చేసినను ఆతని కోర్కె యీడేర లేదు.

తిరిగి వైద్యుడువచ్చి జ్వరము తగ్గుచున్నదనియు, వ్యాధి కుదురు సూచనలు గలవనియు గూడ చెప్పెను. తన కుమారుని యొక్క వ్యాధి కుదురదని భవాని తలంచ లేదు. అతని కొడుకు చిరకాలము జీవించి యుండవలసినదే యని యాతడు గట్టిగ నమ్మియుండెను. పైలెను తనకొడుకున కుపచారములు చేయుటగాంచి భవానియాశ్చర్యపడెను. పట్టణములోనున్నందు వలననే పైలె సంతబుద్ధిమంతుడాయెనని భవాని తలంచెను.

క్రమక్రమముగా కలిపాదుని జ్వరము తగ్గెను. వానికి కొంచెము తెలివి వచ్చెను. తనచెంత భవాని యుండుటను గాంచి యాత డాశ్చర్యపడెను. తన నీచస్థితినిజూచి తనతండ్రి యేమనుకొనునో యని యాతడు దలంచుచుండెను. అంతకం టెను తన తండ్రియొక్క పల్లెటూరి వేషమును, యలవాటు లను జూచి మేడపైనున్న విద్యార్థు లెక్కడ యాక్షేపింతురో యని యాతడెంతయు విచారించుచుండెను. తరువాత మరికొంత

సేపటికి వానికి బాగుగ దెలివివచ్చెను. నాలుగు వైపులను జూచెను. అదియంతయు కలయో నిక్కవమో యాతని కించుకేనియు దెలియలేదు. తానెక్కడ నున్నదియు వాని కసలే తెలియదు.

తన తండ్రియగు భవాని తన్నా నూతనగృహమునం దుంచెనని యాతడు మొదట దలంచెనుగాని యంతటివ్యయము నాతడు భరింపజాలడని తిరిగి యనుకొనెను. తన తండ్రి లేసప్పు డాకొసాని పైలెయు ద్రాక్షపండ్లను దీసుకొని కలిపాదుని చెంతకువచ్చెను. పైలె నట్లువచ్చుటకు కలిపాదుడు కారణ మూహింపజాలక తన్నేమియో పరిహాసముచేయుట కాగ డట్లువచ్చియుండునని యాతడనుకొనెను. అంతట పైలె నొక చోట నా పండ్లనుంచి కలిపాదుని పాదములపై బడి "అయ్యా! నేనొక గొప్ప నేరము జేసితిని. నన్ను క్షమింపుము" అని కలిపాదుని బహువిధముల ప్రార్థించెను. అప్పుడు కలిపాదుడు లేచి తన ప్రక్కమీద గూర్చుండి పైలెను నిశ్చయముగ పశ్చాత్తాపమును బొందెనని గ్రహించెను.

మొట్టమొదట కలిపాదుడు కళాశాలకువచ్చి విద్యార్థు లున్నయింటిలో ప్రవేశించినపుడు పైలెనుతో స్నేహముగానుండ

వలెనని యాతఁ డనుకొనెను. సైలెను తన గదిముందునుండి మేడపైకి బోవునపుడెల్ల నాతని ప్రేమతో జూచుచుండెడివాడు. ఎట్టి కష్టములు గలిగినను గూడ నాతనితో స్నేహము జేయ నెంచెనుకాని దైవవిధి వేరయ్యెను. సైలెను నేడు కలిపాదు నకు ద్రాక్షపండ్ల నిచ్చినప్పు డాతఁ డొక నిముసము వానివంక జూచి వానిని స్వీకరించెను. భవానికిని సైలెనుకును గల స్నేహమును జూచి యాతఁడు సంతోషించెను. సైలెను భవానిని "తాతా" యని పిలుచుచు నాతనితో హాస్యమాడు చుండెను. తన యవ్వయగు రష్మిని చేసిన రుచిగల పచ్చడి నంతయు కలిపాదుఁడు జబ్బుగానుండుటచే తాను దీసికొని వాడుకొంటినని సైలెను చెప్పగావిని కలిపాదుఁడు సంతోషించెను. తాను దిను భాగ్యము లేకపోయినను యితరులైనను తనతల్లిచే జేయబడిన మంచివస్తువులను తిని సంతోషించుటే కలిపాదునకు పరమా నందము. వ్యాధి నయమగుట కారంభమైన దినములే యాతని జీవితములో సంతోషదాయకములై యుండెను.

కలిపాదు డెప్పుడును తన వంశముయొక్క. గొప్పతన మునుగూర్చి మాట్లాడువాడు కాడు. ఒకవేళ తనతండ్రిమాట్లా డిన యెడల తా నది వినుటకు సిగ్గుపడును. భవాని తాను

పోగొట్టుకొన్న డుయిలును తిరిగి సంపాదింతునని యందరితోను జెప్పెడివాడు. తనతండ్రి కది యొక మతిచాంచల్యమువలన గలిగిన భ్రమయని యాతఁ డనుకొనెను. దీని విషయమై కలిపాదు డనేకసారులు తన తల్లితో మాట్లాడియుండెను. ఇట్టి విషయము తనతండ్రి సైలెనుతో మాట్లాడునప్పుడు ఆతనికి మిక్కిలి కష్టముగా నుండెను. సైలెనుకుగూడ నా విషయము వినుట కిష్టము లేకుండెను. దీనియొక్క నిరుపయోగమును గూర్చి సైలెనసేకసారు లాతనితో వాదించుచుండెను. దీనికన్న ముఖ్యవిషయములలో భవాని యితరుల యభిప్రాయముల నంగీకరించినను, యీ విషయములో మాత్రము తనయభిప్రాయమే సిద్ధాంతమని యతఁడు గట్టిగా నమ్మియుండెను. అట్టి సందర్భమున కలిపాదు డుయిలు తీసుకొనినవారుగూడ తమ బంధువులే కావున వారుగూడ తమ యాస్తి ననుభవించుట కర్హులే యని తనతండ్రినో దార్చుచుండెను.

అట్టి సంభాషణమును చాలకాలము వినలేక కొన్ని సమయములయందు సైలెను గదినివిడిచి బయటికిబోవుచుండెను. తనతండ్రినిగూర్చి యాతఁ డేమనుకొనునో యని కలిపాదు డప్పుడప్పు డనుకొనెడివాడు. సైలెను తన బంధుత్వమును చిర

కాలముక్రిందటనే తెలియబరచెడువాడు గాని ఉయిలుయొక్క ప్రస్తాపనవలన నాత డేమియు జెప్పకుండెను. తన తాతగాని, తండ్రిగాని ఉయిలును దొంగతనముగ తీసుకొనియుందురని సైలెనెప్పుడును తలంచియుండలేదు గాని పూర్వార్జితమైన యాస్తిలో భవానికి భాగములేకుండుట మాత్రము మిక్కిలి యన్యాయమని యాతడు తలంచెను.

కలిపాదునకు సాయంత్రము కొద్దిగా తలనొప్పియుండినను అది యాతని నంతగ బాధించలేదు. తాను తిరిగి పాఠములను చదువవలెనని యాతడు తలంచెను. ఏలనన నాసంవత్సరముగూడ స్కాలరుషిప్పు పోయినయెడల తనకు విద్య లభించుట మిగుల కష్టమని యాతడనుకొనెను. డాక్టరు జెప్పిన సలహాను పాటింపక యాతడు దొంగతనముగ తిరిగి చదువనారంభించెను. తా నారోగ్యముగ నుండుటవలన తన తండ్రి నింటికిబొమ్మని కలిపాదుడు జెప్పెను. బహుకాలమునుండి భవాని తనభార్యచే చక్కగపోషింపబడినవాడగుటచే నెప్పు డింటికిబోదునా యని యాతడు దలచుచుండెను.

ఇంతలో కలిపాదుని వ్యాధి తిరిగి యెక్కువాయెను. సైలెనును బయటి దీసుకొనిపోయి కలిపాదునకు వ్యాధిగుదురుట

మిక్కిలి కష్టమని వైద్యుడు జెప్పెను. అంత నైలెను కలిపాదుని తల్లియగు రష్మినిని పిలిపించుడని భవానితో చెప్పెను. రష్మిని కలకత్తాకు చేరినదినముననే కలిపాదుడు మృతినొందెను. తాను దుఃఖించిన తనభర్త నోదార్చుట మిగులకష్టమని యాసాధ్వి తనదుఃఖమును తనలో నడంచుకొనెను. అప్పుడు దైవమును ధ్యానించుచు నామె యిట్లనెను.

"దయాస్వరూపుడవగు నోజగద్రక్షకా, యీదుఃఖమును నే నింక సహింపజాలను"

రాత్రి పన్నెండుగంటలైనది. ఊరికిజేరినతోడనే రష్మిని పండుకొని నిద్రబోవుచుండెను. భవానిచరణు డారాత్రి నిద్ర బోలేదు. అతడు పక్కమీదనుండి, లేచి యింటిలోనుండి బయ టకుబోయెను. చిన్నతనమున కలిపాదుడు తరుచుగా చదువు కొనుచుండిన గదిలోని కాతడుబోయెను. చినిగిపోయిన కొన్ని కాగితములును, తనకుమారుడు చదివిన కొన్నిపుస్తకములను అత డచ్చోటగాంచెను. బొగ్గులతో గోడమీద కలిపాదుడు వేసినలెక్కలు భవానికి స్పష్టముగ గనుపించెను. కలిపాదుడు చిన్ననాడు దాడుగుకొన్న చెప్పొకటి యాగదిలో భవానికి గనుపడెను. ఇవన్నియు భవానికి భూలోకమున సర్వసంపదలట్లు

దోచెను. తన చేతిలోని దీప మొకచోటబెట్టి భవాని కూర్చుండెను. అతని కేమియు దోచలేదు. భవాని చీకటిలో యినుపకమ్ములగుండ బయటజూచెను. కొన్ని చెట్లుగాక మరేమియు వానికి గాన్పించలేదు. అప్పుడు వర్షముకురియుచుండెను. ఆచెట్లు గలచోటనే చిన్నతనమున కలిపాదుడు ఒకతోటను వేసికొనెను. అతనిచే నాటబడిన మొక్కలన్నియు చక్కగ బెరిగెను. దీని నంతయు జూచునప్పటికి భవాని కేమియుదోచలేదు.

ప్రతిదినమును భవాని యిక నెవరికొరకును గనిపెట్టుకొనియుండ నవసరము లేదు. వేసవికాలపు సెలవలువచ్చెనుగాని యీ సెలవుదినములలో మామూలుగ నాగదిలోనికి కలిపాదుడు వచ్చి తనసామానంతయు జూచుకొనెడిభాగ్యము భవానికీజన్మమున లేదు. "ఓ నాప్రియకుమారా! బిడ్డా! కలిపాదా"! యని భవాని దీనవదనుడై విలపింపజొచ్చెను.

భవాని విచారముచేత క్రిందగూర్చుండెను. వర్ష మెక్కువాయెను. అప్పు డెవరో మనిషి వచ్చుచున్న ట్లాతని కడుగుల చప్పుడు వినవచ్చెను. భవాని నిశ్చేష్టితుడాయెను. ఆవచ్చునది కలిపాదుడని యాతడు నిశ్చయముగా నమ్మెను. తనబిడ్డడు తనతోటను జూచుటకే వచ్చెనని యాతడు దలంచెను.

వర్షములో తనకొడు కెంతదడిసెనో, యెట్టికష్టము బడెనో యని యాతని మనసు పరిపరివిధముల చింతింపసాగెను. ఇంతలో నెవరో భవాని జూచుచుండిన కిటికీచెంత నిలుచుండిరి. అతడు తన తల కేదియో చుట్టుకొనెను. గాన వానిముఖమును బాగుగవీక్షించుటకు భవానిక సాధ్యముకాలేదు. ఆనూతన పురుషుడు కలిపాదుని పొడుగున నే యుండెను. ప్రియకుమారా! నేటికి నాకు గనుపించితివాయని యాతడుతలుపుదీయబోయెను. తలుపుదీసి చూచునప్పటికం దెవ్వరును లేరు. అంత నాభవాని కలిపాదా! కలిపాదా! యని బిలచుచుండెను. కాని యాతని కెవరును ప్రత్యుత్తర మీయ లేదు.

ఓటూ యాపుపాకలోనుండి భవానిమాట వినివచ్చివాని నోదార్చి గదిలోనికిబంపెను. మరునాటుదయమున నోటూ గదినూడ్చుచుండ కిటికీయొద్ద కాగితములకట్ట జూచెను. వాడుభవానిచేతికా కాగితములను దెచ్చియిచ్చెను. భవాని వానినన్నిటినిజూచి యది మున్నపహరించబడిన ఉయిలని గ్రహించెను. తాను సులోచనములను బెట్టుకొని వానిలోని కొన్నిబంతులను చదివి పరుగెత్తుకొని రష్మినియొద్ద కేగి యుయమె చేతిలో నాకాగితములను బెట్టెను.

రష్మిని — ఇది యేమిటి?'

భవాని:—ఇది ఉయిలు.

రష్మిని—దీనిని మీ కెవ రిచ్చిరి?

భవాని:—ఎవరో తనంతట తానే రాత్రి నాకు దెచ్చి యిచ్చెను.

రష్మని;—దానితో యిప్పుడు మీ రేమి చేయదలచి నారు?

భవాని:—దీనివలన నా కిప్పు డేమియు ప్రయోజనము లేదు. అని యంత డాకాగితములను చించివేసెను.

# నయంజోరుయొక్క వంశీకులు

మున్నొకకాలంబున నయంజోరుయొక్క వంశజులు ప్రసిద్ధికెక్కిన భూస్వాములు. వారు రాజఠీవిగలవారు. వారి సుకుమారశరీరములు రాపిడిచేత కందునేమో యని ఢక్కామస్లినుయొక్క ముతకఅంచును చించివేయుదురు. ఒక్క పిల్లికూన పెండ్లిచేయుటకు వారు వేలకువేలు ఖర్చుబెట్టెదరు. ఒకానొకప్పుడు రాత్రిని పగలుచేయవలెనని దలచి, లెక్కలేని దీపములను వెలిగించి, ఆకాశమునుండి వెండిదారములను

సూర్యకిరణములకు సాదృశ్యముగ గుర్తించిరను వదంతికూడ గలదు. ఇది వారియొక్క పూర్వపు స్థితి.

వారివంశముయొక్క వైభవము చిరకాలముండలేదు. మా యింటిప్రక్కనున్న కైలాసబాబు వారిసంతతిలో చివరి వాఁడు. ఆయన పెద్దవాఁడగు నప్పటికి వారిస్థితి మిక్కిలి క్షీణ దశకువచ్చెను. ఈయన తండ్రిచనిపోయిన తరువాత వాని యుత్తరక్రియలు వారు మిక్కిలి గొప్పగాచేసిరి కాని తరువాత వా రప్పులలో బడిరి. వారి యాస్తియంతయు యప్పులకు సరిపోయెను. మిగిలినధనముతో కైలాసబాబు తన పూర్వుల యొక్క యుచ్చదశకు సమానుఁడు గాలేకపోయెను. కావున కైలాసబాబు నయంజోరునుండికలకత్తాకువచ్చెను. ఆ యనప్రియ కొమారుఁడుగూడ గతించెను గాని యాతని పుత్రికను కైలాస బాబు మిక్కిలి గారాబముతో పెంచుచుండెను.

కలకత్తాలో మేము కైలాసబాబుయొక్క యింటి ప్రక్కనే యుంటిమి. మాయొక్క వంశచారిత్రము కైలాసబాబు యొక్క చరిత్రమునకు వ్యతిరిక్తమన్న పాఠకులు క్షమింతురు గాక. మాతండ్రి మిక్కిలి కష్టించి ధనమునార్జించెను. అనవ సరముగా నాతఁ డొకకాసైనను ఖర్చుపెట్టెడివాఁడు కాఁడు. అతఁడు పనివానియొక్క దుస్తులను ధరించువాఁడు. ఆయన కెప్పు

డును ధనమును ఖర్చుబెట్టి "బాబు"అను బిరుదమునుసంపాదించ వలెనని కోరిక యుండెకిదికాదు ఆయన నాకు చక్కగ విద్య జెప్పించెను. అందువలన నీప్రపంచములో సుఖముగ జీవించ గలనను నమ్మకము నాకు గలదు. నేనుదప్ప కైలాసబాబును జూచి మరెవరును విసుగుకొనరు. ఆత డొకరి కపకారము జేయువాడు కాడు. చుట్టుప్రక్కల నున్నవారిండ్లలో నేమైన కార్యములు జరిగినయెడల వాటికెల్ల నాతడు తప్పక వచ్చు చుండెను. ఆతనిని జూచి యెల్ల రానందించుచుందురు. గృహకృత్యముల విషయములో నాతడడుగుప్రశ్నల కంతము లేదు. ఎవ్వరైన స్నేహితు లాతనికి బజారులో కనుపడిన యెడల వారి నీవిధముగ లెక్కలేనన్నిప్రశ్నల నాతడడుగును. "స్నేహితుడా నిన్ను జూచుటకు నాకు మిక్కిలి సంతోష మయినది. నీవు క్షేమముగ నున్నావా? హాసి యెట్లున్నది. ఐతే దాద బాగున్నాడా? నీకు దెలియక బోవచ్చును. ఇప్పుడు నేను మధు యొక్క కొడుకు జబ్బు నున్నాడని విన్నాను వాని సంగతి యేమి? నీకీ సంగతి తెలియునా? మరచితిని. హరిచరణ బాబును జూచి చాలకాలమైనది. ఆయన సురక్షితముగనున్నా డనియే నేను దలంతును......రఖాలు సంగతి యేమి?......

మీా యింటిలోని యాడువారి సంగతేమి? అందరు క్షేమముగ నున్నారా?"

కైలాసబాబునకు దుస్తులు కొద్దిగానున్నను వాని నాత డెప్పుడును పరిశుభ్రముగ నుంచుకొనును. తన వస్త్రములను స్వయముగ నెండలోవేసి యెప్పుడును జాగ్రతగ నుంచుకొను చుండును. తగినంతసామానుతో నాతని గదిచూచుటకుముచ్చ టగ నుండును. ఇంకను సామాను కావలసిన యెడల నింటిలోపల నున్నదని యాతడు తన స్నేహితులకు జెప్పుచుండును. ఇంటిలో పనిజేయువా రెవ్వరును లేకపోవుటచే వీధి తలుపునువేసి బట్ట లుతుకు కొనుట మొదలగు పనుల నన్నింటిని జేసికొని తలుపు దీసి తరువాత కైలాసబాబు తన స్నేహితులతో మాట్లాడును.

కైలాసబాబుయొక్క యాస్తి యంతయు బోయినను కొన్ని వస్తువులమాత్ర మాత డప్పులవారినుండి తనయింటనుంచు కొనెను. పన్నీరు జల్లునట్టి వెండిసీసాయు, మిక్కిలి వెలగలిగిన శాలువయు, తలపాగాయు, వేడుకసమయములందు వేసుకొను నట్టి కొన్ని దుస్తులును యాతడు కాపాడుకొన గలిగెను. వీనిని తగిన సమయములలో తాను ధరించి తన వంశముయొక్క పూర్వ గౌరవమును కాపాడు కొనుచుండును.

చుట్టుప్రక్కలనున్న వారాతనిని టాకూరుదాదా యని పిలుచుచుండిరి. వారంద రాతనిచుట్టును జేరి గంటలకొలది కాలము మాట్లాడుచు కూర్చుండెడెదరు. ఆయనకు ఖర్చు తగ్గుటకు వారిలో నొకరు పొగాకును దెచ్చి "టాకూరుదాదా! యీయుదయము ననే గయనుంచి నాస్నేహితులు నా కాపొగాకును బంపినారు. ఇది మీ కెట్లుండునో కొంచెము చూచెదరా" యనియిచ్చును. దానిని తీసుకొని యిది చాల బాగుండెనని టాకూరుదాదా చెప్పును. దాని నంతటితో ముగించక, పూర్వముతనవంశజులు త్రాగిన పొగాకు దాని కన్న మంచిదనియు, కోరినచో వెంటనే తెచ్చియిచ్చెదననియు యాతడు జెప్పుచుండును. కాని వారిలో నెవరైన యట్టి ప్రసిద్ధికెక్కిన పొగాకును దెమ్మని కైలాసబాబు నడిగినయెడల పెట్టెయొక్క తాళముచెవి పోయినదనియో, లేక యాతని సేవకు డెక్కడనో పెట్టి పోయెననియో యాతడు చెప్పునని వారికి బాగుగ దెలియును. అందుచేత వారిలో నొకరు "పోనిమ్ము టాకూరుదాదా! యిప్పుడు పొగాకుకొరకై వెదుకవలదు. మనము తాగుచున్న పొగాకుప్రస్తుతము మనకు జాలును. మీ యింటిలోని పొగాకు మంచిదగుటచేత మిక్కిలి ఘాటుగానుండు నని చెప్పెదరు.

అంత టాకూరుదాదా వారితో తిరిగి యేదియో మాట్లాడుచుండును. వారందరు వెళ్ళిపోవునపుడు టాకూరు దాదా తలుపు వరకును బోయి "అట్లయిన మీరు మాయింటికి భోజనమునకు వచ్చున దెన్నడ"ని ప్రశ్నించును. వారిలో నొకరు "ఇప్పుడుగాదు టాకూరుదాదా! ఇప్పుడుగాదాసంగతి. మనము దానివిషయమై తరువాత నిర్ణయించుకొందమ"ని చెప్పును. "నిశ్చయమే మీరు చెప్పినట్లు వర్షములువచ్చెడిదాక మన మాగవలయును. ఇప్పు డెండలు చాల యెక్కువగ నున్నవి. నేను మీకు జేయబోవు గొప్పవిం దీసమయమున జేసి నయెడల నాకు మిక్కిలి యాశాభంగమై చెడిపోవున"ని కైలాసబాబు వారితో ననును. వర్షము లువచ్చినప్పుడు వారెప్పుడును కైలాసబాబునకు విందు సంగతి జ్ఞాపకముచేయరు. ఒక వేళ యెవరైన పొరబాటున జ్ఞాపకముచేసినయెడల మఱియొక రట్టి గొప్పవిందు నాసమయమున జేయుట బాడిగాదనియు, మఱియొకప్పుడు జేయువచ్చుననియు చెప్పెదరు. ఇట్లు యెప్పటి కప్పుడావిందు జరుగ కుండ నేదోయొక యభ్యంతరము గలుగుచునే యుండును.

టాకూరుదాదా యిల్లంతవిశాలమైనది గాదు. కావున నది యాంతని వంశానుక్రమముగా వచ్చుచున్న లీవికేవిధమునన

నరిపోకుండెను. అందుచేత నాతని స్నేహితులాతని నోదార్చుటకై కలకత్తావంటి మహానగరమున యింతకన్న గొప్పభవనములు దొరుకుట మిక్కిలి కష్టమనియు అయినను తమ శక్తి కొలది మరియొక మంచి గృహము చూచెదమని కైలాసబాబుతో వారు జెప్పినను నిజముగా జూచునట్టి ఛాందసుడెవడును లేడు. అందుచేత నాత డాయింటిలో నుండుటతో డనే సంతృప్తిబొందెను. తా నట్లుండుటకు తన స్నేహితులను వదలుట కష్టము లేకుండుటయే ముఖ్యకారణమని యాతడు తనమిత్రులతో జెప్పుచుండును.

ఈసంగతు లన్నియును జూచుటకు నాకు మిగుల కష్టముగా నుండెను. నయంజోరువంశజులనుగురించి యాతడు మాట్లాడునప్పు డితరు లేమనుకొందురో యనిగూడ తల్పంచక వారిని మిక్కిలి స్తోత్రము జేయును. వానియందలి ప్రేమచేత నాతడు చెప్పుమాట లబద్ధమని యెవరును యాతనియెదుట జెప్పెడివారు కారు. తనవంశమువారినిగూర్చి యితరులు చెప్పునదెల్ల నిజమనియే యాతడు నమ్ముచుండెను. ఆసంగతులందరును తనవలెనే నమ్మెదరని పాపము కైలాసబాబు తలచియుండెను.

నేనెందుకు కైలాసబాబు నసహ్యించుకొనవలెనని కూర్చొని విచారించగా నాతనియెడల నాకు ద్వేషము మరింత హెచ్చెను. దానికి గల కారణ మిది. నేనొక భాగ్యవంతుని కుమారుడను. నా లేబ్రాయముననే నేను కలకత్తా విశ్వ విద్యాలయములో ఎం. ఏ. పరీక్షలో కృతార్థుడనైతిని. నేను సత్ప్రవర్తనగలవాడను. మరియు రూపవంతుడను. నా కనేకసంబంధములు వచ్చుచుండెను. కాని వానిలో నొకదానికైన నే నిష్టపడలేదు. నేను చదువుకొనిన చదువునకు సమానమైన కట్నము నిచ్చు సంబంధమును జేసుకొనవలెనని నేను నిశ్చయించుకొంటిని. కాని బంగాళ దేశ మంతటిలోనైనను నాకు సరియైన సంబంధము దొరుకునా యని నేననుమానించుచుంటిని.

టాకూరుదాదా కొక మనుమరాలుండెనని నే నిదివరకే చెప్పియుంటిని. ఆమెను నేను పలుసారులు జూచియుంటిని. ఆమె యంతచక్కనిది కాదు. ఆమెనాకు భార్యగానుండుట కర్హురాలని నే నెంచలేదు. కాని యెప్పుడైనను కైలాసబాబు తన మనుమరాలిని వివాహముచేసుకొనుమని నన్నతివినయముతో నడుగునని నేను తలచియుంటిని కాని యంతవర కట్టి సంగతి యేమియు జరిగియుండలేదు. ఈకారణమునవలన కైలాసబాబుపై నాకధికమైన యసూయత గలిగెను. ఇంతియెగాక

టాకూరుబాబుతన పిల్లలవిషయమె యొకటని వేడననియు తన పిల్లలకు వివాహము కాకపోయిన యట్లయుండెదరనియు కాని యంతమాత్రమునకై వారి వంశక్రమానుగతముగ వచ్చుచుండిన గౌరవమునుబోగొట్టనొల్లనని తన స్నేహితులతో నాతడు జెప్పెను. ఈగర్వమునకే వానిపై నాకంతకోపముగల్గినది. కాని నేను మిక్కిలిసాధువర్తనుడ నగుటచే దీనికిగూడ నున్నకుంటిని. కానియాతనిపై పగదీర్చుకొనుటకు నాకు తగినసమయము లభించెను.

కైలాసబాబును ఆతని స్నేహితులందరు బొగడుచుందురు. దొరతనమువారి నౌకరిని నియమితకాలమువరకును జేసి యుపకారవేతనము నందుచున్ననొకయుద్యోగి లెఫ్టినెంటుగవర్నరును జూచినప్పుడెల్ల యాయన నయంజోరువంశీకుల యొక్క క్షేమమడుగుచుండుననియు, బంగాళదేశమందంతటను రెండువంశములు మాత్రమె గౌరవపాత్రములని యాయన జెప్పెననియు అందులో నొకటి నయంజోరువంశమనియు, మరి యొకటి కాసీపూరు మహారాజావంశమనియు యాయన జెప్పినట్లు కైలాసబాబుతో నాతడుజెప్పెను. ఇది నిజమని పాపము కైలాసబాబు నమ్మి దానినే పలుమారు ప్రస్తావించు

చుండెను. తరువాత నాయుద్యోగి కనుపడినపుడెల్ల గవర్నరు గారివిషయమై వాని ననేకప్రశ్నలడిగెడివాడు. లెఫ్టినెంటుగవర్నరుగారిని తా నొకసారి చూడవలెనని కైలాసబాబు తరుచుగ జెప్పుచుండును. అది సంభవింపలేదు.

ఒకదినమున నేను కైలాసబాబుతో రహస్యముగ నిట్లు జెప్పితిని. "టాకూరుదాదా, నేను నిన్న ప్రభుపుదర్శనమును జేసియుంటిని. వారు నయంజోరుయొక్క వంశీకులను గురించి ప్రస్తావించిరి. అప్పుడు నేను కైలాసబాబు కలకత్తాలో నున్నాడని చెప్పియుంటిని. మీరువారిని పిలువలేదని వారుమిక్కిలి కష్టముతో ననుకొనిరి. ఈదినమున రహస్యముగ మీయింటికి వచ్చెదమని వారు సెలవిచ్చిరి." నేనుజేసిన యీకుట్రను యెవరైన నొకనిముసములో కనుగొనియుందురు. ఈసంగతి నేనితరుల కెవరికైన జెప్పినయెడల కైలాసబాబుగూడ దానిగుట్టును కనుగొనువాడు కాని పాపము లెఫ్టినెంటుగవర్నరు తనయింటికి వచ్చుటలో నేమియు గొప్పలేదని టాకూరుదాదా తలంచెను. నేను జెప్పినసంగతులను విని కైలాసబాబు మిక్కిలి భయపడి తన కింగ్లీషు రాకపోయినందులకై యెంతయు విచారపడెను. కాని నే నాతనితో యింగ్లీషు నేర్చుకొనక పోయినందువల్ల

వచ్చు ప్రమాద మేమియు లేదనియు లెఫ్టినెంటుగవర్నరుతో దేశభాషలను యింగ్లీషులోనికి తర్జుమాజేయు నుద్యోగస్థు డొక డుండుననియు యాతని సందేహమును దీర్చితిని.

మధ్యాహ్నము చుట్టుపట్లనున్న వారందరు నిద్రబోవు చుండిరి. అప్పు డిద్దరు బంట్రోతులు కైలాసబాబుయొక్క మేడ మీదికి బోయి లెఫ్టినెంటుగవర్నరు గారియొక్క యాగమన మును నివేదించిరి. కైలాసబాబు తనసేవకునితో గవర్నరు గారికి స్వాగతమిచ్చుటకు సిద్ధముగానుండెను. కైలాసబాబు తనపూర్వికుల దుస్తులను ధరించియుండెను. సేవకుడైన గణే శముగూడ కైలాసబాబునకు గల దుస్తులలో మంచివానిని ధరించి తన యజమాని చెంత నిలుచుండెను.

అంతట కైలాసబా బతివినయముతో ప్రభువుగారిని సత్కరించి తన యమూల్యమగు తొలువనుంచిన కొయ్యకుర్చీపై నాతని నాసీనుని జేసెను. అప్పుడు కైలాసబాబు ఉరుదులో గంభీరముగ ప్రసంగించి, యొక బంగారు పళ్ళెరంబున కొన్ని మొహరులనుంచి దాని నాప్రభువునకు కానుకగ సమర్పించెను. దీనితో కైలాసబాబుయొక్క పూర్వులు సంపాదించినయాస్తి పూర్తిగా వ్యయమాయెను. సేవకుడగు గణేశుడు వెనుకనుండి

ప్రభువుగారి కతిజాగ్రతతో పన్నీరును జల్లుచుండెను. అంతట కైలాసబాబు గవర్నరుగారితో తాను స్వగ్రామమున వారిని గౌరవించుట కవకాశము లేనందుకు మిక్కిలి చింతిలుచుంటినని యనేకసారులు జెప్పెను. దీనినంతయు విని నాస్నేహితుడు తన తలయూచెను. ఇంగ్లీషువారి సాంప్రదాయముప్రకారము ఆత డింటిలోనికి వచ్చినంతనే తన తలటోపీని దీయవలసియున్నను తననిజరూపము బయలుపడునని యాత డట్లు జేసియుండలేదు. ఈసంగతి కైలాసబాబుగాని, గణేశముగాని గ్రహించలేదు.

పదినిముసము లైనతరువాత నాస్నేహితుడు వెళ్లిపోవుటకు లేచెను. ఈ పదినిముసములలో నాతడు తన తలనాడించుట తప్ప యొక్కమాటైనను మాట్లాడియుండలేదు. అచ్చట నున్న యిద్దరు సేవకు లంతకుముందు యోచించుకొనిన విధమున బంగారు పళ్లెమును, మొహరులను, శాలువను, వెండి పన్నీరు బుడ్డియు మొదలైన నింకకొన్ని వస్తువులను దీసుకొనిపోయి బండిలోనుంచిరి. కైలాసబాబు యిదియంతయు ప్రభువులకు జరగవలసిన మర్యాద యని తలచెను.

దీనినంతయు నేనొక గదినుండి జూచుచుంటిని. నవ్వు నాపుకొనుట నాకుమిక్కిలి కష్టముగా నుండెను. అందుచేత

నేను మరియొకగది లోనికి పరుగెత్తితిని. అచ్చటనొక జవ్వని యుండెను. ఆమె తనహృదయము బ్రద్దలగునట్లు శోకించుచుండెను. నే నప్పు డేమిసేయగలను? ఆమె నేనునవ్వుచుండుటను జూచి మిక్కిలి కోపముగలదై గద్గదస్వరముతో నన్నిట్లు ప్రశ్నించెను. "నీకు మాతాత యే మపకార మొనర్చినాడో నాతో జెప్పుము- నీ వాతనిని మోసముజేయుట కేలవచ్చితివి. నీ విచ్చటి కేల వచ్చితివి.- ఏమి?" అనియామె యింక మాటాడ లేకపోయెను. ఆమె ముఖమును తనహస్తములచే కప్పుకొని శోకించుచుండెను.

నాసంతస మాగిపోయెను. నేను జేసిన పరిహాసః లో నిట్టి దుఃఖ ముండునని నే ననుకొనలేదు. ఆయువతీరత్నమున కట్టి విషాదము గలుగునని నేనెన్నడును తలచియుండలేదు. నేను జేసిన ఘాతుకము నన్నే నిందింపమొదలిడెను. నే నాగది నుండి వెడలిపోతిని. నాటి రేయంతయు నాకు నిద్ర లేదు. మరునాటియుదయమున నేను లేచి కైలాసబాబుయొక్క వస్తువులన్నియు దీసుకొని వాని సేవకుడైన గణేశమున కిచ్చుటకు వారి గృహమున కరిగితిని. అచ్చట నాకా సేవకుడు గనుపించ లేదు. తరువాత నేను మేడమీదికి బోతిని. అచ్చట కైలాసబాబు

యొక్క మనమరాలగు కుసుమ తన తాతతోఁ గూడ గడచిన దినముయొక్క విందునుగూర్చియు, వారింటికివచ్చిన పురుషపుంగవునిగూర్చియు యడుగుచుండెను. అట్లు వారు చాలసేపు మాటాడిరి. తుదకు కైలాసబాబు గదినుండి బయటకు బోయెను. దీనినంతయుం జూడ నాకుమిక్కిలి విచారము గలిగెను. తరువాత నేనాగదిలోనికి బోయి క్రిందటిదినము నేను ముచ్చిలిన వస్తువుల నానారీరత్నముయొక్క పాదపద్మముల కడనుంచి మాట్లాడ కచటినుండి వెళ్లిపోతిని.

మరునాడు నేను కైలాసబాబును జూచుటకు వెళ్లితిని. ఇదివర కెన్నడాయనకు నేను నమస్కారమును జేసియుండలేదు. కాని యీదినమున మాత్రము నేనాతనికి ప్రేమపూర్వకమైన వందనము జేసి యాతని పాదములపై బడితిని. నాలోనిట్టి మార్పు గలుగుటకు గల కారణము లెప్టినెంటు గవర్నరుయొక్క రాకయే యని కైలాసబాబు తలచియుండెను. తన స్నేహితులందరితోను లెఫ్టినెంటు గవర్నరు తనయింటికి వచ్చుటను గూర్చి కైలాసబాబధికముగ జెప్పుచుండెను. ఇదియంతయు జరిగిన పిదప కైలాసబాబును జూడవచ్చిన వారెల్లరును వారివారి గృహముల కరిగిరి. అప్పుడు నేనతివినయమున కైలాసబాబును

సమీపించి "అయ్యా తమవంటి యఖండవిఖ్యాతిని గాంచిన వంశమువారితో సంబంధము చేసుకొనుటకు నే నర్హుడను కాక పోయినను.................." నేను నావివాహవిషయమై టాకూరుదాదాతో మాట్లాడునప్పటి కాయన యమితానందమంది నన్ను కౌగలించుకొని యిట్లనెను. "నేను మిక్కిలి బీదవాడను. నాకిట్టి యదృష్టము బట్టునని నేననుకొనలేదు."

కైలాసబాబుయొక్క జీవితకాలమునందీయొక్కసమయముననే తాను బీదవాడననియొప్పుకొనుట యొగాక తనవంశజులయొక్క గొప్పతనము నొక్కనిమిషమాత్ర మతఁడు మరచి పోయెను.

# పిల్లవాడు మరలవచ్చుట

## I

సేవకుడుగా ప్రవేశించునప్పటికి రాయచరణుడు 12 సంవత్సరముల ప్రాయముగలవాడై యుండెను. యజమానియు, రాయచరణుడుగూడ నొకటే కులమువారై యుండిరి ఆతఁడు తన యజమానియొక్క కుమారుని నతి జాగ్రతతో పెంచు

చుండెను. కాలక్రమమున పిల్లవాడు పెద్దవాడై పాఠశాలలో జమవుకొనుచుండెను. తరువాత నాతడు కళాశాలలోని పరీక్షలలో నుత్తీర్ణుడై పనిలో ప్రవేశించెను. ఇప్పటికిగూడ రాయచరణుడు తన యజమానియింట పనిజేయుచునే యుండెను.

"అనుకులు"కు సకాలమున తండ్రి వివాహముజేసెను. ఆతని కొక కొమరుడుగూడ గలిగెను. వానిని రాయచరణుడు మిక్కిలి ప్రేమతో బెంచుచుండెను. ఒక్కొకప్పుడు రాయచరణుడా బాలకుని తన చేతులయందుంచుకొని యిటునటు ద్రిప్పును. మఱియొకప్పుడు తానొక బాలునివలె నసహ్యముగ మాట్లాడును. ఇంకొకప్పుడాత డా బాలుని ముఖమునకు సమీపమున దన ముఖమునుబెట్టి నవ్వుచుండును.

కాలక్రమమున నా బాలుడు ప్రాకనేర్చెను. రాయచరణు డా బాలకుని పట్టుకొనబోయినపు డా బాలుడొక కేక వేసి తప్పించుకొని పాఱిపోవును. దీనినంతయు జూచిన రాయచరణు డా బాలకుని తెలివి కాశ్చర్యము నందుచుండెను. ఒకానొకప్పు డా రాయచరణుడు తన యజమానురాలితో నాపిల్లవాడు "న్యాయాధిపతియగున"ని చెప్పుచుండును.

కొంత కాలమున కాబాలుడు తప్పటడుగు లిడసాగెను. అప్పుడు రాయచరణునకు గలిగిన సంతసమునకు మేరయే లేదు.

ఆ పిల్లవాడు తల్లిని "అమ్మా" యనియు, తండ్రిని "బాబా" యనియు గాయచరణుని "చన్నా" యనియు పిలచినతోడనే గాయచరణు డా శుభవార్తను ప్రపంచమునందెల్లవారికిని తెలియజేసెను.

గాయచరణుడా బాలకు నాడించుట కనేక వేషములు వేయుచుండును. ఒక్కొకసారి గుర్రమువలె తననోటిలో తాడును బెట్టుకొని యెగురుచుండును. మరియొకప్పు డాత డాబాలునితో కుస్తీపట్టుపట్టి దీనిలో తా నోడిపోవుటచే గట్టిగా నరచును.

ఇంతలో అనుకు లింకొక యూరికి మార్చబడెను. అప్పు డాతడు తన బిడ్డ షికారుబోవుట కొక బండియు, చక్కని గుఱ్ఱమును, మంచి టోపియు, కొన్ని బంగారు నగలును దెచ్చెను. షికారునకు బోవునపుడు సాధారణముగ గాయచరణు డా పిల్లవానికి వస్తువుల నన్నియు బెట్టుచుండువాడు.

వర్షకాలము వచ్చెను. వర్షమమితముగ గురియుచుండెను. అచ్చట నున్న నది ఘనీభవించెను. ఒక దినమున వర్షము కొంచెము తెరపిచ్చెను. గాయచరణు డా పిల్లవానిని బండిమీద నెక్కించుకొని నదియొద్దనకు షికారువెళ్ళెను. ఆ నదిచెంతనే కదంబవృక్ష మొకటి గలదు. దానియందు మనోహరములైన

పుష్పములు గలవు. ఆ పుష్పములతో రాయచరణు డా బాలు డాడుకొనుట కొక బండిని గట్టిపెట్టెను. ఆ బండికి బాపమునుగట్టి యా బాలు డా దినమంతయు నాడుకొనెను. ఆ కారణమువలన నా బాలుడు తిరిగి పుష్పములను రాయచరణునకు జూపించెను. కాని యీ దినమున పూవులను గోసియిచ్చుటకు రాయచరణున కిష్టములేదు. ఏలనన, నాత డా పూవులనుగోయుటకు మొలలోతు బురదలో చెట్లయొద్దకు బోవలసియుండెను. అందుచేత తానా బాలుని కొక పక్షినిజూపుచు, నన్ని యా విధముల పక్షివలె తా నరచుచు, వేగముగ నచ్చోటినుండి బండిని దీసుకొనిపోయెను.

కాని జడ్జికాబోవు పిల్లవా డంతమాత్రమునకే తాను గోరిన కోర్కెను విడచునా? రాయచరణు డెన్నియుక్తులను బన్నినను ఆ బాలు డా పుష్పములపై యాసను మాత్రము వీడలేదు. అందుచేత రాయచరణు డా బాలుని యచ్చటనుండి నది చెంతకు బోవలదని యెన్నిసారులో జెప్పి తాను బురదలో దిగి పూవులను దెచ్చుట కరిగెను.

బాలుడు మాత్రము నదిలోని జలముయొక్క వేగమును జూచి పరమానందభరితుడై రాయచరణుని మాటల నేమియు

బాటించక నదిచెంత కరగెను. అచ్చట తాను చేపలను బట్టు చున్నట్లొక కర్రను నీటిలోనుంచి లేపదీయుచుండెను. ఇంతలో రాయచరణుడు పువ్వులను గోసికొనివచ్చెను. కాని బండిలో మాత్రము తన యజమానియొక్క పుత్రుడులేడు. అప్పుడు రాయ చరణున కెచ్చటలేని భయముబుట్టెను. కాని పాప మాతడేమి చేయగలడు! ఆబాలుని పేరుబెట్టి రాయచరణు డనేకసార్లు బిలిచెనుగాని యెవ్వరును బలుకలేదు. సాయంత్రమువరకును రాయచరణుడిట్లే తనచిన్నియజమాని కొరకై పిచ్చివానివలె వెదకుచుండెను. కాని యాతనికెవరును గనుపించలేదు.

సాయంత్ర మగునప్పటికి బాలుడురానందువలన వాని తలిదండ్రులు దీపములనిచ్చి పనివాండ్రను బాలుని వెదకుటకు బంపిరి. వారు వెదకి వెదకి తుదకు రాయచరణుని దీసికొని పోయి వాని యజమానుర్రాలి కప్పగించిరి. ఆబాలుడు నదియం దైన మునిగియుండవలెను లేదా యెరుకలవాండ్లైనను తీసుకొని పోయి యుండవలెనని వారందరు తలంచిరి. అనుకులుయొక్క భార్య తన బిడ్డవిషయమై రాయచరణుని యనేకవిధముల ప్రశ్నించెనుగాని, బిడ్డ విషయమైతానేమియు నెరుగనని రాయ చరణుడుజెప్పెను. అందువలన నామె పట్టరాని కోపముతో

వానిని యింటినుండి వెడలిపొమ్మనెను. పిల్లవాని యొద్దనున్న వస్తువులకాసపడి రాయచరణుడా బాలుని సంగతి నెరుగనను చున్నాడని యామె స్థిరముగ నమ్మెను. ఆమె సందేహము నెవరు దీర్చగలరు?

రాయచరణుడు తన స్వగ్రామమును జేరెను. అంతవర కాతనికి సంతతి లేదు. ఇకముందు గలుగు నను యాశగూడ యాతనికి లేదు. ఇది యిట్లుండ కొన్నిదినములకాతని భార్య గర్భవతియై యొక మొగబిడ్డనుగని చనిపోయెను. ఈపిల్లవాడు మాటయందును, చిరునగవునందును, పనులయందును చనిపోయిన యాతని యజమానునియొక్క కొడుకును సర్వవిధముల బోలి యుండెను. క్రమక్రమముగా ఫాలినుడు మాట్లాడజొచ్చెను. వానిని రాయచరణుడు బహువిధముల బోషించుచుండెను. గొప్ప ధనికుని కుమారుని బెంచినటుల తాను తన కుమారుని బెంచు చుండెను. రాయచరణుడా బాలకునకొక కోటును, మిక్కిలి వెలగల నొక టోపియు, షికారుబోవుటకొక బండియు గొని తెచ్చెను. చనిపోయిన తన భార్యయొక్క నగలనుకరగించి యాతడా కుర్రవానికి నగలనుజేయించెను. తన కుమారుని తోడిబాలురతో నాడుకొననియ్యక తానే వానిని సర్వదా కాపాడు చుండెను.

దీనినిజూచి పిల్లలును, పెద్దవారును రాయచరణుని, వాని కుమారుని మిక్కిలి దూషించుచుండిరి. రాయచరణుడు తనకున్న భూమినంతయు నమ్ముకొని తన కుమారుని విద్యకై కలకత్తా నగరమునుజేరెను. బహుప్రయాసతో తానొకచోట సేవకావృత్తికి కుదిరి తన కొడుకును పాఠశాలలో ప్రవేశ పెట్టెను. ఈవిధముగ తన కొడుకున కేవిధమైన లోపము లేకుండ జరుపుచు తాను మాత్రము సకలకష్టములను బొందుచుండెను. దీనికైనను రాయచరణుడు విచారమును బొందలేదు. ఏలనన తన యజమానునికొడుకు తిరిగి తన యింట జన్మించుటయే యాతని కపరిమితానందముగ నుండెను.

ఈవిధముగ 12 సంవత్సరములు గడచెను. పిల్లవాడు బాగుగ వ్రాయుటకును, చదువుటకును నేర్చుకొనెను. బాలుడు కూడ మంచి యందగాడు. ఆబాలుడు తన యిష్టమువచ్చినట్లు డబ్బు ఖర్చుపెట్టెడివాడు. రాయచరణుని యందా బాలునికి పితృవాత్సల్యమున్నను యాతనిని తన సేవకునివలె జూచెడివాడుగాని తండ్రివలె యాదరించెడివాడుకాదు. దీనికి కారణ మాతని తండ్రియె. మఱియొక తప్పేదన రాయచరణుడెవరితోనైనను తానా బిడ్డయొక్క తండ్రినని చెప్పెడి వాడుకాదు.

రాయచరణుని యొక్క పల్లెటూరి చేష్టలనుజూచి ఫాలినా చదువుకొనెడి బడిలోని పిల్లలందరాశ్చర్య పడుచుండిరి. ఫాలినాకూడ తన తండ్రి యచ్చటనుంచి పోయినదేలోడనే వారితో గలసి తన తండ్రిని పరిహాసము జేయుచుండును. రాను రాను రాయచరణునకు వార్ధక్యము హెచ్చుగుచుండెను. తన కొడుకుయొక్క సుఖముకొరకై తాను తరుచుగ నుపవసించుటచే నాతడు బలహీనుడాయెను. దీనికితోడు నాతని జ్ఞాపకశక్తిగూడ క్షీణింపజొచ్చెను. వానియజమాని యాతనియెడల నించుకేని కనికరము జూపక పూర్తిగ పనిని జేయించుకొనుచుండెను. రాయచరణు డింటినుండి తెచ్చిన ద్రవ్యమంతయు వ్యయమైపో యెను. తనకొడుకు డబ్బుకొరకై యాతనిని మిగులబాధించ దొడగెను.

రాయచరణుడు తననౌకరిని చాలించుకొని ఫాలినాకు కొంతధనమునిచ్చి తనకింటి యొద్ద పనియున్నదనియు, త్వరలోనే దానిని పూర్తి చేసుకొని తిరిగివచ్చెదనని తనకొడుకుతో జెప్పి అనుకూలున్నచోటికి వెళ్ళెను. అప్పటికిగూడ అనుకులు యొక్క భార్యయింకను తన ప్రియకొమారుని దలచుకొని దుఃఖించుచుం డెను. ఆమెకు తిరిగి బిడ్డలు కలిగి యుండలేదు.

ఒకదినమున అనుకులు చావడిలో కూర్చుండి యొసట దీర్చుకొనుచుండెను. అతనిభార్య సంతతికొరకొక మూలికను మితిమీరిన ధరకు గొనుచుండెను. అప్పుడెవరో వాకిట బిలుచు చుండిరి. అనుకులు వాకిటనున్న వానిజూచి మాట్లాడబోయెను. ఆవచ్చినది రాయచరణుడు. రాయచరణుని జూచునప్పటికి అనుకులు యొక్క హృదయము కరగెను. వాని ననేకప్రశ్నలడిగి యాతనిని తిరిగి తన సేవకునిగ దీసుకొనుట కాతడంగీకరించెను. అప్పు డాతడింటిలోని కరిగెను. కాని వాని యజమానునిభార్య వానిసంత నెక్కువగ నాదరించలేదు. రాయచరణుడు దీనిసంతగ బాటించక తనచేతులు గట్టుకొని "నీకొడుకును తస్కరించినది పద్మగాదు నేన"నిచెప్పెను.

"ఓపరమేశ్వరా! ఇది యెంత చిత్రము! ఇది నిశ్చయమేనా! అట్లయిన నా కుర్రవాడేడ"ని అనుకులు రాయచరణు నడిగెను. "ఆకుర్రవాడు నాయొద్దనే యున్నాడు. వానిని రేపు లేదెల్లుండి దెచ్చెదన"ని రాయచరణుడు జెప్పెను.

ఆదినమాదివారము గాన మ్యాజిస్ట్రీటు కచేరిలేదు. రాయచరణుడెప్పుడు వచ్చునాయని భార్యాభర్త లిరువురును మిక్కిలి యాసతో జూచుచుండిరి. పదిగంటలకు ఫాలినాను దీసుకొని రాయచరణుడువచ్చెను. అనుకులు యొక్క భార్యరాయ

చరణునితో నేమియు మాట్లాడక పిల్లవాని ననేక విధముల ముద్దాడి యాలింగన మొనర్చుకొనుచుండెను. అనుకులుకు గూడపుత్రునిపై ప్రేమయధికమాయెను. ఐనను అనుకులు రాయ చరణునిజూచి "ఈతడు నాకొడుకని నీవేమి నిదర్శనమును జూపెదవ"ని యడిగెను.

రాయ—ఏమి నిదర్శనమును జూపగలను! నేను మీ కొడుకును తస్కరించినది లేనిది దేవుని కొక్కనికే మాత్రమే దెలియును.

తనప్రియురాలా బాలకుని వాత్సల్యముతో ముద్దాడు టకుగాంచి యనుకు లనుమానమును వీడినవాడై రాయచర ణునిజూచి కఠినముగ "రాయచరణుడా! నీవిచ్చటనుంచి పొమ్మ నెను. "అయ్యా యిప్పుడు నేనెక్కడికి బోవలెను. నేను వృద్ధు డను కాబట్టి నన్నెవరును సేవకునిగా నుంచుకొనరు"అని చేతులు గట్టుకొని గద్గద స్వరముతో రాయచరణుడుబల్కెను. అప్పు డనుకులు యొక్క భార్య యిట్లనెను. "వానినుండనిండు. వానియందు మన బాలునికి ప్రేమకలదు. . వాని తప్పులను నేను క్షమించితిని"

కాని అనుకులు మాత్రము రాయచరణుడు వారింటనుం డుట కిష్టపడలేదు. అంత పాపము! రాయచరణుడు నేలమీదబడి

అనుకులుయొక్క పాదములను బట్టుకొని "అయ్యా! నన్ను మీ యింటనుండనిండు. ఈపని చేసినది నేనుగాదు. దీనిని దైవమే చేసెను." అని యాతడనెను. కాని యప్పటికిని అనుకులుకు రాయ చరణునిపయి దయరాలేదు. దీనినంతయు పాలినా జూచుచుండెను.

తాను మేజస్ట్రీటు యొక్క కొడుకని యంతవరకును చెప్పనందుకు మొదట రాయచరణునిపై యాతనికి కోపము వచ్చినను రాయచరణునియొక్క దీనావస్థను జూచినంతనే వానిపయియాతనికి దయ గలిగి రాయచరణుని తమయొద్ద సేవకునిగా నుంచుమని తనతండ్రినాతడు మిక్కిలి ప్రార్థించెను. ఒకవేళ నాతని నింటియందుంచుట కిష్టములేని యెడల నెలకు కొంత పెన్షను నిచ్చుటకైననంగీకరించుమని పాలినా తనతండ్రిని మిక్కిలి వేడుకొనెను.

రాయచరణుడీ మాటలను విని మరేమియు మాట్లాడక తనయజమానుని యొద్దనుండి సెలవు గైకొని తనప్రియ కుమారుని కడసారి జూచి యచటినుంచి వెళ్లి పోయెను. నెలాఖరుకు రాయచరణునకు కొంతడబ్బును అనుకులు మనియార్డరు ద్వారా బంపెను. కాని యది తిరిగి వచ్చెను. ఆ యూరియం దెవరును రాయచరణుడను పేరు గలవారు లేరు.

# సుభ

ఘండ్ పురమునందు బనికాంతుడొక కుటీరమునందు నివసించు చుండెను. వారిగృహమునకు సమీపముననే యొకనది మిక్కిలి మనోహరముగ ప్రవహించుచుండెను. ఆనదికిరు పార్శ్వములందును పెద్ద పెద్ద కట్టలుగలవు. ఆకట్టల పైనున్న తరులతాగుల్మాదు లానదికి మిక్కిలి శోభను దెచ్చుచుండెను. బనికాంతునకు ముగ్గురు కూతుండ్రు గలరు. వారికాయన సుకేశిని, సుహాసిని, సుభాషిణి యని పేర్లుబెట్టెను. సుభాషిణి నామె తలిదండ్రులు సుభయనికూడ బిలచెడివారు. యుక్త వయస్సు వచ్చినతోడనే సుకేశిని, సుహాసినియను నిద్దరు కూతుండ్రకును తలిదండ్రులు పెండ్లిజేసి వారి సత్తునాండ్రకి బంపిరి.

ఇకనొక సుభాషిణియే యింటిలోనుండెను. సుభాషిణి మంచిరూపవతి. ప్రతివారును యామెయొక్క సౌందర్యమును జూచి యచ్చెరు వందుచుండిరి. ఇట్లున్ననుగూడ నామెను తలిదండ్రులు అనాదరణముగ జూచుచుండిరి. ఏలనన యామె మూగది. ఆమెవిషయమై యామె తలిదండ్రులు రాత్రింబగళ్లు చింతించుచుండిరి. ఇది యామె గ్రహించి మిక్కిలి దుఃఖించు

చుండెను. కాని యాబిడ్డ యేమిచేయగలదు. ఇంటిలోని పని యంతయు పూర్తియైన తోడనే సుభనదియొడ్డున గూర్చుండి ప్రకృతితోడనే తన దీనావస్థ నెల్లను జెప్పుకొనుచుండెనో యను నట్లు గూర్చుండును. కానియొక నాడేనియు ప్రకృతి యామెతో మాట్లాడలేదు. ఆమె యైనను ప్రకృతితో మాట్లాడి యెరు గదు.

ఇట్లని యామెకు నీ ప్రపంచములో నాప్తులు లేరని చెప్పుటకు వీలులేదు. పశువులపాకలో రెండావులుగలవు. ప్రతి దినమును మూడుసారులు వానిని సుభ జూచుచుండును. అప్పుడు సుభ వానిని దువ్వికొన్ని అస్పష్టవాక్యములతో వానితో నేమియో మాట్లాడి తిరిగి యింటిలోనికి బోవుచుండును. ఆమె మాటల నాగోవులర్థము చేసుకొనక బోయినను వాటికి సుభయం దపారమైన ప్రేమగలదు. కావున యొక్కొక్కప్పుడామె నా యావులనుజూచి తనకష్టములను జెప్పుకొనుటకు నాలుగు సార్లు గూడ పోవుచుండును,

సుభ కీ జంతుద్వయము మాత్రమేగాక కొన్ని మేక లును, పిల్లికూనయు కూడ స్నేహపాత్రములై యుండెను. కాని యివి యావులంత స్నేహపాత్రములుగావు ఆయూరియందు ప్రతాపుడను వాడొకడు కలడు. అతడొక సోమరివాడు. వాని

వలన నేమియు ప్రయోజనము లేదని వాని తలిదండ్రులు వానిని వానియిష్టము వచ్చినట్లు తిరుగుటకు వదలివేసిరి. ప్రతాపుడు తరుచుగ నదిలోని చేపలను బట్టువాడు. అప్పు డాతడు సుభనుజూచి మిగుల సంతోషించి యామెను "సు" యని పిలచెడివాడు. సుభగూడ నాతని మిగుల ప్రేమతో జూచు చుండెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప సుభయొక్క తలి దండ్రులు కలకత్తాకు బోవుటకు నిశ్చయించుకొనిరి. ఈ సం గతి సుభకు దెలిసిన తోడనే యామెకు భరింప శక్యము గానంత దుఃఖమువచ్చెను. కొంతసేపామె యొంటరిగ దుఃఖించి తుదకు తనదుఃఖము నాపుకొనలేక తనతండ్రి పాదములపై బడెను. సుభయొక్క స్థితిజూచి నప్రతాపునకు గూడ దుఃఖము వచ్చెను. బహుప్రయాసతో నాతడు తన కూతురుయొక్క దుఃఖము నుపశమింప జేసెను.

అంత సుభ పశువులపాకలోనికిబోయి యావులను బాగుగమేపి, వాటి నాలింగనము చేసుకొని, మిక్కిలి దుఃఖించి తిరిగి యింటిలోనికి బోయెను. కలకత్తాకు వారుచేరిన కొలది కాలమునకే సుభయొక్క తల్లి తన కూతునకు జడవేసి మంచి నగలన్నియును బెట్టెను. అప్పుడు సుభయొక్క కన్నులనుండి

బాష్పబిందువులు రాలుచుండెను. తల్లి యెన్నిసారులామెను క్రోసపములో జూచి వలదనినను సుభయొక్క దుఃఖమాగి పోలేదు. ఇంతలో పెండ్లికొడుకు తనస్నేహితులతో పెండ్లి కూతును జూచుటకువచ్చెను. ఆతడు పిల్లను చాలసేపు పరీక్షించిచూచి ప్రమాదమేమియు లేదనియు, ఆమె యిప్పుడు తన తలిదండ్రులను విడచుటకు దుఃఖించుచున్నను, కాలక్రమమున సుఖముగలుగవచ్చునని యనెను. అంతనొకశుభ ముహూర్తమున సుభవివాహము తగువైభవముతో జరిగెను. వివాహమైన వెంటనే సుభయొక్క తలిదండ్రులు వారిస్వగ్రామమునకు బోయిరి. వివాహమైన పదిరోజులకు పిల్ల మూగదని వారికి తెలిసెను. ఐనను వారప్పుడేమి సేయగలరు! పాపము సుభమాత్రము తన తలిదండ్రులను విడనాడి క్రొత్తవారితో నుండుట తటస్థించుటచే లోలోనమిగుల దుఃఖించుచుండెను.

## పనికిమాలిన కుర్రవాడు

కిరానన్నా నాయూరిలోవారందరికినిమిక్కిలి ప్రేమ. ఆమెకు జబ్బుచేసినపు డాయూరిలోని వారందరామె కెప్పుడునయమగు

నాయని తలంచుచుంటిని. ఆయూరినుండి మఱియొక యూరు తన భార్యను తీసుకొని వెళ్లుటకు శరత్ దలచెను గాని వారందుల కిష్టపడలేదు. ఏలనన నాయూరిలోని వారికెంత ఇచ్ఛచేసినను గూడ మరియొకయూరికి బోకుండగనే వా నయమగుచుండెను. కాని శరత్, ఆతని తల్లియు యోచించి కిరానును చంద్రనాగూరునకు తీసుకొనిపోయిరి.

కిరానుకు చంద్రనాగూరు క్రొత్త. అందుచేత నామె కచట స్నేహితులెవరును లేరు. ఆమెతిరిగి తన యూరు చేరవలె నని మిక్కిలి కుతూహలముతో నుండెను. అదృష్టవశమున నామె వ్యాధి కాలక్రమమున దగ్గి పోవుచున్నను వైద్యుడామెను చంద్రనాగూరునందు మరికొన్ని దినములుండుమని చెప్పెను. ఒక దినమున పెద్దతుపానొకటి యాయూరియందు చెలరేగుచుండెను. ఉరుములు, మెరుపులతోడ నపరిమితముగ వర్షము కురియుచుండెను. గంగానదిగూడ మిక్కిలి భయంకరముగ నుండెను. నదియొడ్డున నున్న చెట్లు బహువిధముల నిటునటు యూగుచుండెను.

అట్టిసమయమున నాభార్యాభర్త లిరువురు తిరిగి తమ స్వగ్రామమునకు బోవు విషయమై యాలోచింపదొడగిరి. అప్పుడు వారి సేవకుడొకడువచ్చి, "అయ్యా, గాలివానలో నొకపడవ

మునిగిపోయెను. అందులోనుండి యొక బ్రాహ్మణ కుఱ్ఱవాడు ప్రవాహము నీది తప్పించుకొని వచ్చినాడని" చెప్పెను. వెంటనే కిరాను బ్రాహ్మణ పిల్లవానికి కొన్నియారిన వస్త్రములను గట్టుకొననిచ్చెను. తనగదిలోని కాపిల్లవానిని దీసుకొని పోయి వానికొక గిన్నెడు వేడిపాలను త్రాగుటకునిచ్చెను. ఆపాలనా బాలుడు త్రాగిన తరువాత వానివృత్తాంత మామె యడుగగా నాబాలు డిట్లని చెప్పెను. "అమ్మా, నాపేరు నీలకంఠము. నేను నాటకమాడువారిలో నొకడను. మాసమాజకులంద రీగ్రామమునకు సమీపమునందున్న నొకయూరిలో ప్రదర్శన మొనరించి వచ్చుచుండ నీదురవస్థ సంభవించినది. నాకీతవచ్చుటచే నేనిచ్చటకు రాగలిగితిని. ఇకముందేమి చేయుటకును నాకు దోచలేదని యాతడామెతో జెప్పెను.

ఆబాలుడు వారింటనే యుండెను. గొప్ప యాపదనుండి దప్పించుకొనుటచే కిరాను కాబాలునియం దపరిమితానురాగముగలిగి యుండెను. ఆపిల్లవాడుండుట తన భార్యకు సంతోషము గావున, వానిని కొంతకాల మచ్చటనుండుటకు శరత్ ఒప్పుకొనెను. శరత్ తల్లియుగూడ నాబాలుని కరుణతో జూడదొడగెను. దీనినంతయుజూచి నీలకంఠము మిక్కిలి సంతసించెను. తరువాత కొంతకాలమునకు నీలకంఠము

వారింటనుండుటకు శరత్‌కును, వానితల్లికిని యేమాత్రమిష్టము లేకుండెను. శరత్ దాఁగెడు హుక్కాను నీలకంఠము దొంగ తనముగ మహదానందముతో త్రాగుచుండెడివాఁడు. వర్షమెక్కు వగా నున్నప్పుడు తాను శరత్ యొక్క పట్టుగొడుగును వేసు కొని యూరిలోనికి షికారు బోయెడివాఁడు. దారిలో కనుపించిన వారందరాతనియొక్క స్నేహితులే. ఆయూరిలోని యొకసంకర జతికుక్కను నీలకంఠము బహుప్రేమతో పెంచుటచే నది రశత్ యొక్క యింటిలోనికి మట్టికాళ్ళతో వచ్చి తెల్లనిపక్క నంతయు పాడుజేసి పోవును. ఇంతియగాక నీలకంఠము కొంత మంది చెడ్డపిల్లవాండ్లను జతజేసుకొని వారితో నాయూరిలోని మామిడికాయల నన్నియు గొట్టి తిని పారవేయుచుండును.

కుఱ్ఱవాని నిట్లుజెరుచుటలో కిరాను సహాయపడెనమాట నిజము. శరత్ తనభార్యకీసంగతి నెంతస్పష్టముగ జెప్పినను యామె మాత్రమామాటలను లక్ష్యపెట్టలేదు. శరత్ యొక్క విడిచినబట్ట లను, క్రొత్తబట్టలను, వేసుకొనుటచే నీలకంఠముయొక్క గర్వము మితిమీరి డంబాచారియాయెను. కిరాను కాబాలునియందు మిక్కిలి ప్రేమయుండుటచే తరుచుగా నామె వానిని తనగదిలో నికి బిలిచి యోగక్షేమము లడుగుచుండెను. స్నానముచేసి మధ్యాహ్న భోజనమును జేసినతరువాత కిరాను తాంబూలము

వేసు నుచు ప్రక్కమీఁదను గూర్చినియుండ సేవకురాలామె కురులనార్చుచు తలనుదువ్వుచుండును. అప్పుడు నీలకంఠమామె కెదురుగ నిలుచుండి తాను నేర్చుకొనిన పద్యములను సమయోచితముగ నభినయముతో చక్కగ బాడుచుండును. ఇట్టివేళలందు రమ్మని శరత్ను కిరాను వేడుకొనినను వానికి నీలకంఠము యెడ గాఢమగు విముఖ్యముండుటచే నాతఁడెప్పుడు నట్టి వినోదములను జూడఁడు. ఒకవేళ శరత్ చూడవచ్చినను నీలకంఠ మాతఁడు లేనిసమయములలో బాడినట్లు పాడఁడు. శరత్ తల్లిగూడ నీలకంఠము బాడుపాటలలో దైవసంబంధమైన సంగతులేమైన నుండునేమోయనివినుచుండును. వినియామెన్వరలో నిద్రబోవును.

శరత్ మాత్రము నీలకంఠము నప్పుడప్పుడు శిక్షించుచుండెడివాడు కాని యిట్టి శిక్షలనాతఁడు నాటకములలో నెన్నియో యనుభవించియుండుటచే వానినాతఁడు లెక్కసేయలేదు. నీలకంఠముయొక్క వయస్సింతయని స్పష్టముగ జెప్పుట చాల కష్టము. కావున యెవరునుగూడ నాతఁడింత వయస్సుగలవాడని చెప్పలేకపోయిరి. నాటకములలో నీలకంఠము సీత, దమయంతి మొదలగు పాత్రలనుధరించెడివాడు. కాలక్రమమున నీలకంఠము పెద్దవాడయ్యెను. పూర్వమువలె కిరానుముందు తానాడవేష

ము వేయుట కాతనికి సిగ్గగుచుండెను. కారణమేమియో యత నికే తెలియలేదు. కిరాను వేషము వేసుకొని యాడుటకు బిలచి నప్పుడాత డెచ్చటికో పరుగెత్తి పోయెడివాడు. ఈవిధమున మరి కొంతకాలము జరిగెను.

నీలకంఠమునకు చదువుకొనవలెననెడి కోరిక యుండెను కాని మతిస్థిరము లేదు. అందుచే నాతనికి విద్య బాగుగ లభించ లేదు. ఒకానొకప్పు డాతడు గంగానదియొడ్డున గూరుచుండి పడవ వెళ్ళునప్పుడందులోని జనులకు తనవిద్యాప్రభావము దెలి యుటకయి యుచ్చైస్స్వరముతో సరచును. పడవబోయిన వెంటనే పుస్తకము నూరక జూచుచుండును. ఆతను పాడెడిపాటల కాత నికే యర్థము దెలియదు. తరువాత కొంతసేపటికి కాతడు తిరిగి గృహమునకు వచ్చును.

కిరత్ కొక సోదరుడు కలడు. అతడు కళాశాలలో జదువు కొనుచుండెను. వానికి సెలవుదినములగుటచే కిరానునుజూచుటకా యూరువచ్చెను. కిరానునుసాటిమనో కేమియాడువారు. కావునవా రిద్దరొకప్పుడాటల తోడను, మరియొకప్పుడు పోట్లాడుటయందును, యింకొకప్పుడు తిరిగి స్నేహముగ నుండుట చేతను కాలమును బహు వినోదముగ గడుపుచుండిరి. ఒకొక్కప్పుడు ఆమె వాని కనులను తనకోమలములగు హస్తములతో మూయును. మరి

యొకప్పుడాతని నింటిలోనుంచి తలుపుగడియ వేసి వినోదమును జూచుచు డును. సాటిషుగూడ నూరకుండువాడు గాడు. ఆమె యుంగరములను తాళము చెవులను దీసి యాతడొకప్పుడు దాచుచుండును. ఆమె వేసుకొను తమలపాకులలో మిరియాలు బెట్టును. చూడకుండ నున్నప్పుడామెను ఒకపరుపునకు గిట్టి వేయును.

దీనినంతయు చూచుటకు నీలకంఠమునకు మిక్కిలి కష్టముగ నుండెను. అందుచే నాతడు తన స్నేహితులను నిష్కారణముగ గొట్టుటచే వారేడ్చుచుబోవుదురు. కుక్కను తన్నుటచే నది దుఃఖముతో మిన్నుముట్టునట్లు మొరుగును. ఆతడెచ్చటికైన షికారునకు బోయినపుడు త్రోవపొడుగునను చెట్లయొక్క కొమ్మలను, ఆకులను తనబెత్తముతో గొట్టి పారవేసిపోవును.

తినుటలో నీలకంఠమును మించినవారెవరునూ లేరు. అందుచేత కిరాను అతడుభోజనము చేయు నపుడుదగ్గరగూర్చుండి యాతని కేమిగావలసినదియు యడుగుచుండును. కాని సాటిషు వచ్చినప్పటినుండియు కిరాను నీలకంఠమును మరచిపోయెను. ఆకారణమువలన నీలకంఠము సరిగ భుజించుట మానివేసెను.

పనిజేయు మనిషి యేలభుజించలేదని యడిగిన నాకాకలిగాలేదని నీలకంఠము జెప్పుచుండును. అట్లు చెప్పుటచే కిరా

నుతో నా పనిమనిషి తనసంగతి జెప్పెననియు, తరువాత నామె తన్నుబిలచి బలవంతము జేసి యన్నము బెట్టుననియు, నీలకంఠము దలచెనుగాని పాప మాతడు పొరబడెను. ఏలనన కిరానతని విషయమై పనిజేయు మనిషి నడిగియుండలేదు. పనిజేయు మనిషి యాతని విషయమేమియు నన యజమానురాలితో జెప్పి యుండ లేదు. ఇందువలన నీలకంఠమున కపారమైన దుఃఖముగలిగి తన గదిలో దీపము వెలిగించకుండగనే పరుండి కొంతసేపటికి నిద్రబోవును. కాని యీతనిస్థితి మునుపటివలె కనుగొను వా రెవరు? ఓదార్చు వారెవరు'

తనపైన కిరానుకసహ్యము గలుగుటకు సాటిషే ముఖ్యకారకుడని నీలకంఠము గట్టిగా నమ్మియుండెను. కిరాను మామూలుగ తనతో మాట్లాడక పోయినయెడల సాటిష్ యేదియో తనమీద నామెతో జెప్పెనని యాతడు తలంచును. రాబోవు జన్మమునందైనను తన్ను సాటిషుగను, సాటిషును తన్నుగను సృజించుటకు దేవునిని పలుమారాతడు ప్రార్థించును. బ్రాహ్మణుని కోపము వ్యర్థముగాదని యాతడు నమ్మియుండెను. నీలకంఠమునకు సాటిష్పై గల కోపమును బహిరంగముగ జూపుట కాతనికి ధైర్యము లేదు గాని యాతని ననేకవిధముల కష్టపెట్టుచుండును. నదిలో స్నానముజేయుటకు సాటిషు వెళ్లి

నప్పు డాతడు మెట్లమీద సబ్బును బెట్టినయెడల తిరిగి యాతడు వచ్చునప్పటికది యచ్చట నుండదు. ఒకసారి యాతని దుస్తులలో నొకటి ప్రవాహమునబడి కొట్టుకొని పోవుచుండెను. గాలిచే నది నదిలోబడి యుండునని యాత డనుకొనెను.

ఒక దినమున కిరాను, సాటిషునుసంతోష పెట్టవలెనని తలచి నీలకంఠమును బిలచి యొకపద్యమును బాడుమని చెప్పెను కాని నీలకంఠము విషణ్ణహృదయుడై యేమియు బలుకకుండ నిలుచుండెను. అంత కిరాను కారణమేమియని యాతని నడిగి నప్పుడు నాకాపద్యము జ్ఞాపకము లేదనిచెప్పి నీలకంఠ మచట నుండి పోయెను.

కొన్ని దినములకువారు తిరిగి తమ స్వగ్రామమునకు బోవలెనని సర్వ ప్రయత్నములును జేయుచుండిరి. సాటిషు వారితో బోవుటకు తన సామానంతయు సర్దుకొనుచుండెను. కాని పాపము నీలకంఠమును దలచిన వారైనను లేరు! ఆతడా యూరియందుండవలెనో లేక వారితో రావలెనో యను విష యమును గూర్చియైనన్ను వారు మాట్లా డలేదు

పాపము తుదకు కిరానే నీలకంఠమును వారితో దీసి కొని పోవలెనను సంగతిని దెచ్చెను. కాని యింటిలోని వా రెవరందు కిష్టపడలేదు. అందుచేత నామెవారు బయలుదేరు

టకు రెండుదినములు ముందు నీలకంఠమును బిలచి ప్రియవచనములతో వానిని వాని స్వగ్రామమునకు బొమ్మని చెప్పెను. అప్పుడు నీలకంఠము యొక్క కనులనుండి బాష్పబిందువులుబడెను. దానినిజూచి కిరానుగూడ మిగుల విచారపడెను. దీనినంతయు జూచుచున్న సాటిష్ కిరానుతో "నీహృదయమున కనికరము గలుగుటకు వాడిట్లుజేసెనుకాని మరేమియు లేదు. కావున వానిని మనయింట నుంచవద్ద"ని చెప్పెను. అంతట నీలకంఠ మచట నుండి వెళ్లిపోయెను. అప్పుడు నీలకంఠమునకు సాటిష్పై గలిగిన కోపమును వ్రాయుటకన్న చదువరులె యూహించుకొందురు గాక.

సాటిషు కలకత్తానుండి శరత్ను జూచుటకువచ్చినప్పుడొక శిరోబుద్దిని దీసకొని వచ్చెను. అది చక్కలి యందమైనది. దానిని ప్రతిదినమును సాటిషు కడిగి శుభ్రముచేసుకొను చుండెను. కాని యిది యొకనాడు వానికి గనుపించలేదు. అందుచేత దానిని నీలకంఠము దీసుకొనెనని తలచి వానిని కిరానుయొద్దకు బిలుచుకొనివచ్చి "ఓరి ఏ రా! నీవు నా సిరోబుడ్డి దీసుకొంటివి గాన దానిని తిరిగి నా కిచ్చివేయుము"సి యనెను. అప్పుడు నీలకంఠమునకు గలిగిన మనోవ్యాకుల మపరిమితమై యుండెను. కిరానుకుగూడ దీనినంతయు జూచుట కిష్టములేదు. కావున

నామె నీలకంఠము నొకగదిలోనికి దీసుకొనిపోయి "నీలు! నీవు శిరాబుడ్డిని నిశ్చయముగ దీసినయెడల చాటున నాకిమ్ము. ఇతరు లేమియు నిన్ననకుండ నేను జేసెద"ననెను. దానికి నీలకంఠ మేమియు మాట్లాడలేదు. ఆతడు మిక్కిలి దుఃఖించెను. అంత కిరాను గదిలోనుండి బయటకువచ్చి నిశ్చయముగ నీలకంఠమా శిరాబుడ్డిని దీయలేదని చెప్పెను. కాని సాటిషు శరత్ గూడ వాడే తీసియుండెనని జెప్పిరి. అంతట వారిద్దరును నీలకంఠమును బిలచి కొన్ని ప్రశ్నలనడిగి వానిపెట్టెను పరీక్షింప దలచిరి కాని కిరాను అందుల కంగీకరింపకుండుటచే నాటి కావిషయ మంతటితో నాగిపోయెను.

ఇల్లువాకిలి లేక యనాథయై వారింట జేరినపిల్లవాని విషయమై యిట్టిసంగతులు జరుగుట కిరానుకుమిక్కిలి కష్టమాయెను. అందుచే నామెకొన్ని త్రబట్టలును, చెప్పులును గుట్టించి బాంకునోటొకటిదీసకొనివానిగదిలోనికి పోయెను. నీలకంఠమున కాశ్చర్యము గలిగించుట కామె యిట్లు చేయదలచెను. ఆమె యొద్దనున్న దాళముచెవుల గుత్తినుండి యొకతాళముచెవిని దీసి దానితో వానిపెట్టెదీసెను. ఆపెట్టెగూడవానికామెయే యిచ్చెను. పెట్టెనిండ నీలకంఠముయొక్క సామాను నుండెను. అందులో కత్తులు, బొంగరములు మొదలగు నాటవస్తువు

లెన్ని యోకలవు. వాటినన్నిటిని దీసిచూచుచుండ యింటిలో బోయిన శిరాబుడ్డియుగూడ నందులోనుండెను. దాని నామె చేతిలో నుంచుకొని యాశ్చర్యముతో జూచుచుండెను.

అప్పుడు నీలకంఠము తనగదిలోనికి వచ్చెను. కిరాను వానిని జూడలేదు. నీలకంఠముమాత్ర మంతయు జూచెను. తనదొంగతనమును బట్టుకొనుటకు కిరానొచ్చినదని యాతడు తలంచెను. ఆతని కేమియు దోచలేదు. సాటిషుమీఁది కోపము చేత నాతడాపనినిజేసెను. ఆశిరాబుడ్డి నాతడు నదిలోపార వేయుటకు నిశ్చయించుకొనెను. కాని పొరబాటున దానినితన పెట్టెలో బెట్టుకొనెను. తాను నిర్దోషినని కిరానుతో నాతడప్పు డెట్లు చెప్పగలడు?

అంత కిరానొక నిట్టూర్పువిడిచి శిరాబుడ్డియు, తాను దెచ్చినవస్తువులును, బాంకునోటును, పెట్టెలో బెట్టి తాళము వేసివెళ్ళిపోయెను. మరుసటిదినమున నీలకంఠ మెచ్చటనుగనుపడ లేదు. పోలీసువారికిగూడ వానిసంగతి యేమియు తెలియలేదు. అంతట శరత్ వానిపెట్టెను పరీక్షించదలచెను. కాని దయార్ద్ర హృదయముగు కిరానందుల కిష్టపడలేదు. తరువాతనామె పెట్టెను తనగదిలోనికి దెప్పించి శిరాబుడ్డిని దీసిపెట్టెను నదిలోపారవేసెను.

తరువాత వారందరు రాయూరిలోనుండి వెళ్ళిపోయిరి. నీలకంఠముయొక్క పెద్దకుమారుడు కన్యావ్యాపారము నడిపించుచున్నాడు.

# తపాలాధికారి.

తపాలాధికారి మొట్టమొదట ఉలపూరులో పనిజేయుచుండెను ఆయూరుచిన్నదైనను నీలిమందు యంత్రాగారములను స్థాపించివ్యాపారమును జేసికొనుచున్న పాశ్చాత్యుడొకడాయూరిలో టపాలకచేరి యుండునట్లేర్పాటు జేసెను.

తపాలాధికారియొక్క నివాసస్థలము కలకత్త. ఆపల్లెటూరిలో నున్నందువలన నాతని కేమియు తోచకుండెను. ఒకపూరియింటిలో నాతనికచేరినేర్పాటు జేసుకొని యచటనే వండుకొనుచుండెను. ఆయూరియందాయనకు స్నేహితులు లేరు. కావున యాయన కేమియు దోచక పద్యములను వ్రాసికొనుచుండెను.

ఆయనకిచ్చెడి జీతము బహుస్వల్పము. అన్నము వండుకొనునపుడాయనకు రతనను యనాధబాలిక సహాయము

జేయుచుండెను. రత నమాయకురాలు. ఆమెకు తలిదండ్రులు గాని, బంధువులు గాని ఎవ్వరును లేరు. ఆమె తండ్రి యామెను మిక్కిలి గారాబముతో బెంచెను. ఆమెకొక సోదరుడుగలడు. వానితో నామెతరుచుగా ఆడుకొనుచుండెడిది గాని దురదృష్టవశమున నాతడుగూడ మృతిజెందెను. ఈసంగతులన్నియు టపాలాధికారితో ఒకానొక ప్పుడాయనాథ బాలిక చెప్పుచుండును. ఈకథయంతయు పూర్తి యగునప్పటికి చాలప్రొద్దుపోవుటచే వేగముగ రతను కొంత రొట్టెను తయారుజేసి మధ్యాహ్నముజేసియుంచిన పదార్థములనే వేసుకొని యానాడు వారుభుజించువారు.

రతను తన తలిదండ్రులను దలచి యెట్లు దుఃఖించెడిదో టపాలాధికారి గూడ యట్లే తన బంధువులను దలంచుకొని యొకొక్కప్పుడు మిక్కుటముగ దుఃఖించెడివాడు. కాని వారి నెవరో చార్చెదరు!

టపాలాధికారి కేమియు దోచక రతనుకు విద్యాభ్యాసము చేసెను. రతనుగూడ తెలివికల దగుటచే త్వరలో విద్యను నేర్చుకొనెను.

తపాలాధికారి తరుచుగ రతనునుబిలుచుచుండును. తన్నెప్పుడు బిలచునాయని యామె కనిపెట్టుకొనియుండి యాయన పిలచిన

తోడనే రాక "దాదా మీరు నన్ను పిలచినారా"యని యడు
గును. దాని కతడు ప్రత్యుత్తర మిచ్చినతోడనే యామె టపాల
కచేరిలోనికి బోవును. ఒక దినమున రతను తన్నెప్పుడు టపా
లాధికారి పిలచునాయని చాలసేపు కనిపెట్టుకొనియుండెను. కాని
యాతఁ డెంతసేపటికిని యామెను బిలువలేదు. కాబట్టి తన
పుస్తకములను దీసుకొని యామె టపాలకచేరిలోని కొచ్చెను.
ఆమె వచ్చునప్పటి కాయన పండుకొనియుండెను. కాబట్టి
యాతఁడు విశ్రాంతి దీసుకొనుచుండెనని తలచి యామె తిరిగి
వెళ్ళిపోవుచుండెను. అప్పు డెవరో "రతన్"అని పిలచినట్లామెకు
వినబడెను. వెంటనే యామె "దాదా, మీరు నిద్రబోవుచున్నా
రా?" యని టపాలాధికారి నడిగెను. "అమ్మా! నాకు శరీర
మారోగ్యముగ లేదు. నేనెట్లుంటినో చూడుము"ని దీనస్వర
ముతో నాయధికారి యనెను. రతను వెంటనే వైద్యుని బిల్చుచు
కొనివచ్చి యాతడిచ్చిన మాత్రలను తన యజమానికిచ్చి రాత్రి
యంతయు యుపచారములను సేయుచు యాతని సేమ మడుగు
చుండెను.

క్రమక్రమమున టపాలాధికారి తిరిగి యారోగ్యవంతు
డాయెను. ఆయన కాయూరియం దుండుటకు నీరుపడలేదు
గావున తన్నా యూరినుండి మరియొక యూరికి మార్చుమని

కలకత్తా కొరకు దరఖాస్తును బంపెను. ఒక వారము దినముల వరకు రతను నా యధికారి బిలచియుండలేదు, ఒక దినమున నాతడు రతనును బిలచెను.

రతన్—దాదా మీరు నన్ను బిలచినారా?

టపా—రతన్ రేపు నేను వెళ్ళిపోవుచున్నాను.

రతన్—మీరు తిరిగి యెప్పుడువచ్చెదరు?

టపా—నేను తిరిగి రాను.

దీనికి రతన యేమియు మాట్లాడలేదు. తరువాత టపాలాధికారి తన దరఖాస్తును కలకత్తాలోని యధికారు లంగీకరించలేదనియు, అందుచేత తా నుద్యోగమును మానుకొని తన స్వగ్రామమునకు బోవుచున్నాననియు రతనుతో జెప్పెను. కొంతసేపటివరకు వారిద్ద రేమియు మాట్లాడలేదు. దీపము మినుకు మినుకుమని వెలుగుచుండెను. పాకలో నొకమూల వర్షబిందువులు బడుచుండెను. తరువాత కొంతసేపటికి రతను లేచి వంట జేయుటకు వంటయింటిలోనికి బోయెను. కాని ప్రతిదినమువలె నామె యుత్సాహముతో వంట జేయలేదు. ఆమె యేదియో యోచించుకొనుచుండెను.

టపాలాధికారి భోజనము చేసిన తరువాత "దాదా, నన్ను మీ యింటికి దీసుకొనిపోయెదరా" యని రతన నడిగెను.

"ఎంతమాట"యని పోస్టుమాస్టరు నవ్వెను. రాత్రియంతయు యాతడు రతన్ మాటయే యనుకొనుచుండెను. మరునటి యుదయమున సూర్యోదయమునకు ముందే రతన్ బావినుండి నీళ్ళను దెచ్చెను. టపాలాధికారి స్నానముజేసి "రతన్ నే నీ యూరు నుంచి వెళ్ళుచున్నాను. నీవు విచారపడవద్దు. వచ్చె టపాలాధికారితో నిన్ను జాగ్రత్తగ జూచుమని చెప్పెద"ననెను. ఈ మాట లాతడు మిక్కిలి దయతో జెప్పెను రతన్‌కు మాత్ర మిష్టము లేకుండెను. కావున నామె టపాలాధికారితో నిట్లు దుఃఖముతో జెప్పెను. "అవసరము లేదు. మీరు నా విషయమై యెవరితోను జెప్పనవసరము లేదు. ఇక్కడుండుట నా కిష్టము లేదు."

ఇదివర కెప్పుడును టపాలాధికారి మాట రతను మీరి యుండలేదు. కాని నేటిదిన మామె యాతని మాటలను లెక్క సేయలేదు. టపాలాధికారి యా మాటలను విని నిశ్చేష్టితుడాయెను. ఏలనన ఇదివర కెప్పు డాయనకు రత నట్టి జవాబిచ్చి యుండలేదు. తరువాత వచ్చిన పోస్టుమాస్టరుకు కాగితములన్నియు యప్పగించి కచేరివానివశముజేసి పాత టపాలాధికారి తన స్వగ్రామమునకు ప్రయాణమాయెను.

అప్పు డాతడు రతనును బిలచి తన జీతములో ప్రయా

దారి ఖర్చులకు కొంచెము పైకమును దీసుకొని మిగిలినది యజమాను కియ్యబోయెను గాని యజమాను తీసుకొనలేదు. టపాలాధికారి యొక నిట్టూర్పువిడచి తనసామానంతయు పెట్టెలో బెట్టుకొని, యా పెట్టె నొక కూలివానికిచ్చి తన భుజముమీద గొడుగును బెట్టుకొని పడవరేవుకు వెళ్ళెను. పడవలో గూర్చుండి టపాలాధికారి తన స్వగ్రామమునకేగుచుండెను గాని యనాథయగు నా బాలిక రతన కనులకు గప్పడుచుండెను. ఆ బాలిక మాత్రము టపాలాధికారి తిరిగి వచ్చునని తలంచెను.

## హారలాలు

### I

అధరబాబు అను నాయన ఉత్తరహిందూస్థాన దేశ వాస్తవ్యుడు. అతని తండ్రి చనిపోవునప్పుడాతనికి విశేషధనమును విడచిపెట్టి పోయెను కావున నాతడే యుద్యోగమునందును ప్రవేశింపక తన రొక్కమును వడ్డీకిచ్చుచు దానిమీద వచ్చు వడ్డీతోడనే తన కాలమును సంతోషముగ గడుపుచుండెను. ఆతని యొద్ద నున్న గుమాస్తాలప్పుడప్పుడాతని చెంత కొచ్చి పత్రములను

గురించి, మాట్లాడిపోవుచుందురు. దలాలులు గూడ యప్పు విషయమై యాతనితో మాట్లాడుచు హుక్కాను త్రాగి వెడలిపోవుచుందురు.

డబ్బు విషయములో అధరబాబు బహు జాగ్రతగనుం డెను. కాబట్టి ఆయూరిలోని "ఫుడ్ బాల్ క్లబ్బు" లోని పిల్ల లాతని నెంతబ్రతిమాలినను ఒక కాసయిన నియ్యలేదు.

అధర్ బాబునకు బిడ్డలు లేకపోవుటచే కొంతకాలము చింతించెను. కాని తుద కాతని కొక బాలుడు గలిగెను. ఆ బాలుడు తల్లి పోలికగలవాడై యుండెను. కావున నాతడఖండ యశమును గాంచునని, జ్యోతిష్కులును, శాస్త్రజ్ఞులును నిర్ణ చించిరి. ఇది విని యాబాలకుని తలిదండ్రులు మిక్కిలి సంతో షించిరి. విశాలమగు నయనంబులును, సుందరంబగు నాసికం బును, సొబగైన దేహచ్ఛాయ యాపసిబాలున కెంతయు శోభను దెచ్చుచుండెను.

ఇంటి కగు ఖర్చు లన్నియు బాబు తనయిష్టము వచ్చి నట్లు చేయుచుండెను. గాని యెకప్పుడైన యాతని గృహిణి యాతనికి వ్యతిరిక్తముగ మాట్లాడునదిగాదు. కాని బాలుని విషయమున నామె తనయిష్టమువచ్చినట్లు ధనమును వ్యయము జేయును. దానికి బాబు కిష్టము లేకున్నను మాట్లాడిననేమి

య్యుప్రయోజనముండదని యూరకుండువాఁడు. ఆబాలునికి వేణు
గోపాలుడని తలిదండ్రులు పేరు బెట్టిరి.

## II

వేణుగోపాలుడు దినదినాభివృద్ధి బొందుచుండెను. క్రమ
క్రమముగ తండ్రిగూడ నాబాలుని విషయమై ధనమును విరి
విగ ఖర్చు బెట్టుచుండెను. అధర్ బాబు తన ప్రియకుమారునికి
చదువు జెప్పుట కొక యుపాధ్యాయుని నేర్పరచెను. ఆయుపాధ్యా
యుడు బాగ చదువుకొన్న వాడని పేరుబడి యుండెను. ఇంతియ
కాక నాతనియొద్ద చదువుకున్న బాలురెంత తెలివితక్కువవా
రైనను ప్రతి పరీక్షలో ప్యాసగు చుండిరి. ఐనను, వేణుగోపా
లునకును, అతని తల్లికిని యాయుపాధ్యాయు డన్న మొదటి
నుండియు నిష్టము లేదు. కాబట్టి శీఘ్రకాలములోనే యాబాలు
నికి విద్యగరపుటను యాయుపాధ్యాయుడు మానకొనెను.

ఆసమయముననే హరలాలను నతడు మాసినబట్టలను
గట్టుకొని చినిగిపోయిన కాన్వసు చెప్పులనుదొడుగుకొని అధర్
బాబును చూడవచ్చెను. హరలాలుకు తండ్రి లేడు. తల్లి వితం
తువు. ఆమె యితర యిండ్లలో వంటజేసియు, డిస్ట్రిక్టుస్కూ-
లులో హరలాలునకు మెట్రిక్యులేషను వరకును చదువుజెప్పిం

చెను. ఆత డిప్పుడు కాలేజీలో ప్రవేశించుటకు సర్వప్రయత్న ములు జేయుచుండెను. ఇంతలో అధర్ బాబు పనివాండ్లలో నొకడొచ్చి "ఎందుకువచ్చితివి" అని హారలాలు నడిగెను. అతడు భయపడుచు గద్గద స్వరముతో "అధర్ బాబును చూచుట కొచ్చితిన"నెను. అంతనా సేవకుడు "నీవిప్పుడు చూచు టకు వీలు లేదు". అని హారలాలుతో ననెను. హారలాలు కేమి చేయుటకును దోచలేదు. ఇంతలో వేణుగోపాలుడు తోటలో నేమియో యాడుకొని యచటికొచ్చెను. అప్పు డాసేవకుడు హారలాలును "ఇక్కడనుంచి వెళ్లిపొమ్ము" అని యనుచుండెను. దీనిని గోపాలుడు విని హారలాలుపందపారమైన ప్రేమగలవాడై సేవకుని మందలించి నూతన పురుషుని తన తండ్రి చెంతకు దీసుకొని పోయెను.

అధర్ బాబప్పుడు మధ్యాహ్నము నిద్రనుండి లేచి, డాబా పయిన కుర్చీలో గూర్చుండి కాళ్యాడించుకొను చుండెను. రతీ కాంతుడు అధర్ బాబు చెంత కుర్చీపయిన కూర్చుండిహుక్కాను ద్రాగుచుండెను. అప్పుడు రతీకాంతుడు హారలాలును జూచి "నీవింతవరకు జదివితివ"ని యడిగెను. అంతహారలాలు సిగ్గునతల వంచుకొని మెట్రిక్యులేషను ప్యాసైతినని జెప్పెను. రతికాంతు డంత హారలాలుని కోపదృష్టితో జూచుచు యాయిాడునకు హార

లాలు మైత్రికి వ్యాలేపను ప్యాసగుటకెంతయు యాశ్చర్యమును బొందెను కాని హారలాలేమియు మాట్లాడలేదు. తన సేవకుల నే విధముననైనను బాధించుటయే తన స్వభావముగాన రతీకాంతుడు హారలాలు విషయమై యిట్లుబలికెను.

అకస్మాత్తుగ హారలాలును తన కొడుకునకు చదువు చెప్పుట కుంచుకొనిన బాగుండునని ఆధర్ బాబునకు దోచెను, కాబట్టి హారలాలును తనయింట నుంచుకొని యతనికి కావలసిన బట్టలును, భోజనమును జరుపుటయేగాక నెలకైదు రూపాయిల జీతమిచ్చుట కాతడంగీకరించెను. దానికి హారలాలు సమ్మతించెను.

## III

ఈ యుపాధ్యాయుడు మునుపటి యుపాధ్యాయునికన్న నెక్కువ కాలము బాలునకు చదువు చెప్పగలిగెను. మొదట నుండియు గురు శిష్యుల కన్యోన్యవాత్సల్యమెక్కువగ నుండెను. హారలాలు తనజన్మములో వేణుగోపాలుని ప్రేమించినట్లు మరియొకరిని ప్రేమించియెరుగడు. ఒక వేళ ప్రేమింతమనుకొన్నను అనతల్లి మరియొకరి యింటనుండుటచే నాతని కట్టియవకాశముగూడ లభించలేదు. హారలాలంతటి స్నేహితుడు దొరకినందువలన

వేణునకుగూడ యానందముగలిగెను. వేణునకిద్దరు చెల్లెం డ్రు డినను వారితో నాతడెప్పుడాడుకొనెడివాడు కాడు. కావున హారలాలే యాతనికి స్నేహితుడును, గురువునై యుండెను.

కాలక్రమమున వేణునకు పదకొండు సంవత్సరములు నిండెను. హారలా లింటరుమీడియేటు పరీక్ష బాగుగ వ్యాసయి నందువలన సర్కారువా రతనికి స్కూలు జీతమును తీసివేసి స్కాలరుషిప్పునిచ్చిరి. కాబట్టి బి, యే. పరీక్షలోగూడనట్లే కృతార్థతనొందవలెనని హారలాలు రాత్రింబగళ్లు కష్టించి చదువు కొనుచుండెను. ఆతడుకాలేజిలోనుండి వచ్చినతరువాత వేణును "పార్కు"లోనికి తీసుకొనిపోయి విక్టరుహ్యూగో వ్రాసిన చిత్రకథ లును, గ్రీకు చరిత్రలోని కథలును చెప్పుచుండెడివాడు.

బాలుడుకూడ తానుబడినుండి వచ్చినవెంటనే తనతల్లి యొద్దనుండక హారలాలుకొరకై పరుగెత్తెడివాడు. ఇట్టి ప్రవ ర్తన గోపాలునితల్లి కిష్టము లేదు. హారలాలు తనయుద్యోగము నందు శాశ్వతముగ నుండుటకు తనకొడుకుతో నిట్టి స్నేహ మును జేయుచున్నాడని అఘర్‌బాబు భార్యతలంచెను. అందు చేత హారలాలు వినునట్లామె తెరచాటునుండి "నీవు ప్రతిదిన మును మాపిల్లవానికి ప్రొద్దునను సాయంత్రమున గంటగాని రెండు గంటలుగాని పాఠమును జెప్పవచ్చునుకాని యెప్పుడును

నీవు మాపిల్లవానితో నుండుట భావ్యముగాదు. నీవలన మా పిల్లవాడు వాని తలిదండ్రులనే మరచిపోయినాడు. నీవంటి నీచ మానవుడు నాకొడుకువంటి కులీనవంశజునకు తగిన స్నేహితుడు గాడని నీవిప్పుడైనను తెలుసుకొనవలెన"ని యామె యనెను. అప్పుడు హారలాలు తానికముందు వేణునకు పాఠము మాత్రమె చెప్పి తక్కిన కాలములో నాతని చెంతనుండనని గద్గద స్వరమున నామెతో జెప్పెను.

మామూలుగ హారలాలు తన పాఠములన్నియు వేకువ జామున లేచి చదువుకొనెడివాడు. కొంచెము ప్రొద్దెక్కునప్పటికి వేణు హారలాలుచెంతకు వచ్చెడివాడు. అంత వారిద్దరును గలిసి తోటలోనికి బోయెడివారు. ఆతోటలో నొక చిన్న కొలనుగలదు. ఆకొలనులో చేపలనుపట్టుకొనుచు వారు కొంతసే పాడుకొందురు. తరువాత వేణు బొమ్మరిల్లునుగట్టుకొనును. ఆయింటి కమ్ప్చునగోడ్లును, త్రోవలునువారికమందానందమును గల్గించుచుండును. ఇట్లు కొంతకాలము గడపియింటికిబోయెదరు. అప్పుడు హారలాలు వేణునకు పాఠమును జెప్పును.

నాటిదినము గోపాలుడు ప్రతిదినముకన్న ముందుగా లేచి హారలాలును గలుసుకొనుటకొచ్చెను. ఏలనన క్రిందటిదినమున గోపాలునకు హారలాలొక కథను జెప్పుచుండెను. అదిమిక్కిలి

వినోదముగ నుండుటచే దానిని వినుటకాతనికిమరింత యాసబొడ మెను. ఐనను వేణునకు కాశాభంగము గలిగెను, ఎక్కడ జూచినను హారలాలు కనుపించలేదు. సేవకులు హారలాలిప్పుడే యెక్కడకో వెళ్ళినని చెప్పిరి.

పాఠమువేళకు హారలాలొచ్చెను. కాని గోపాలుడు హారలాలెక్కడికి వెళ్లినది యడుగలేదు. తరువాత ప్రాతఃకాల భోజనమునకు గోపాలుడింటికి బోయెను. గోపాలునితల్లి తన కొడుకు విచారముగనుండుటను గాంచి మిక్కిలిచింతించి కారణ మడిగెను గాని గోపాలుడేమియు ప్రత్యుత్తర మీయలేదు. మరియు ఆనాడాతడు సరిగభుజించలేదు.

వేణుగోపాలుడు భోజనముచేసిన తరువాత తల్లితన బాలుని దగ్గరగూర్చుండ బెట్టుకొని, బుజ్జగించి "తండ్రీ నీవు దుఃఖించుటకు గలకారణ మేమని" పెక్కుసార్లడిగెను. అప్పుడా పసిబిడ్డ "అమ్మా! హారలాలు బాబసి" బిగ్గరగనేడ్చెను. "బిడ్డా! హారలాలు నిన్నేమిచేసెనని" యామెయెంత బతిమాలినను తన యుపాధ్యాయుడు చేసిన తప్పును బాలుడు చెప్పలేకపోయెను. "నాయనా నామీద నీయుపాధ్యాయు డేమైనచెప్పెనా" యని యామెయింకొకసారి తన కుమారుని ప్రశ్నించెను. కాని యీ ప్రశ్న వేణునకర్థముగాలేదు. వేణు యెచ్చటికో వెడలిపోయెను.

## IV

ఆధర్ బాబు యింటిలో దొంగతనము జరిగెను. కేసును విచారించుటకు పోలీసువారొచ్చిరి. హారలాలు పెట్టెలు గూడ సోదా చూడబడెను. దొంగతనము చేసినమనిషి తాను దొంగిలించిన వస్తువులను పెట్టెలో బెట్టునని రతీకాంతుడనెను.

అప్పుడాధర్ బాబు తన కుమారునికి చదువు చెప్పుచుండిన హారలాలును బిలచి "ఇకనుండి మీరెవరును మాయింట నుండుటకు వీలులేదు. ఈదినమునుండి నీవొకయింటిలో కాపురముండి చదువు చెప్పుటకు మాత్రము మాయింటికి రావలెను" అని చెప్పెను.

మీరు చెప్పినది యుభయులకును మంచిదని రతికాంతుడనెను. హారలాలేమియు మాట్లాడలేదుగాని వేణునకు పాఠము చెప్పుటకు తనకు వీలులేదని తరువాత అధర్ బాబునకు నుత్తరమును వ్రాసెను.

వేణు బడినుండి యింటికివచ్చి చూచునప్పటికి తన యుపాధ్యాయుని గదిలో నెవరును లేరు. పగులగొట్టిన ట్రంకు పెట్టెగూడ నాగదిలో లేదు. దక్షిణముమూలతువాలైనను, బట్టయైనను వేసియుండలేదు. కాని మామూలుగ పుస్తకములును కాగితములునుండెను. బల్లపైన హారలాలు తనస్వదస్తూరితో

"వేణు" అని వ్రాసియుంచిన కాగితము మాత్రమాతడు జూచెను. వెంటనే గోపాలుడు తన తండ్రి యొద్దకు పరుగెత్తుకొనిపోయిహార లాలు విషయమై యడిగెను. అధర్ బాబు హారలాలు తన పద వికి రాజీనామానిచ్చెనని తన ప్రియకుమారునితో జెప్పెను. వేణు తన గదిలోనికిబోయి క్రిందబడి యేడ్చుచుండెను. అధర్ బాబున కేమి జేయుటకు దోచలేదు.

తరువాతదినమున హారలాలు హాస్టలులో కూర్చుండి కాలేజిలోనికి వెళ్లుటను గురించి యాలోచించుకొనుచుండగా వేణు అధర్ బాబుయొక్క సేవకునితో నచ్చటికి వచ్చెను. అప్పుడు వేణు హారలాలును కౌగలించుకొని తిరిగి తన యింటికి రమ్మని నాతని నెన్నియోవిధముల ప్రార్థించెను. గోపాలుడు జూపినట్టి యద్వితీయమగు ప్రేమకు హారలాలు నిశ్చేష్టితు డాయెను.

V

వీరి సమావేశమైన తరువాత తానుపరీక్షలో ప్యాసయి నను, స్కాలరుషిప్పుదొరుకుటకష్టమని హారలాలనుకొనెను. అతని కికచిత్తశాంతి లేదు. స్కాలరుషిప్పు లేకపోయిన యెడల తాను

చదువుట దుర్లభమని యాతనికి దెలియును. కావున నాత డుద్యోగమునకు ప్రయత్నము జేయుచుండెను.

అతని యదృష్టవశమున నొక గొప్పవ్యాపారస్థుని దగ్గర నున్న మ్యానేజరగు నొక యాంగ్లేయు డాతనిని జూచినంతనే సాయముజేయ సంకల్పించుకొనెను. అంత హారలాలు మ్యానేజరుతో కొంతసేపు మాట్లాడిన తరువాత మ్యానేజరాతనిని యోగ్యతా పత్రములను నిమ్మనెను. కాని దానికి హారలాలు తానిదివరకెచ్చటను పనిజేసియుండలేదనియు, యోగ్యతాపత్రములను తనకెవరీయలేదనియు మ్యానేజరుతో చెప్పెను.

ఐన నా యాంగ్లేయపురుషోత్తంను డాతనికి నెల 1 కి రు 20 ల నిచ్చుట కంగీకరించి దుస్తులను కొనుటకును, యింటి ఖర్చునకును, 15 రూపాయలు ముందుగ హారలాలున కిచ్చెను.

మ్యానేజరు హారలాలునకు కష్టమైనపని నిచ్చెను. చాల ప్రొద్దుపోవువరకును హారలాలు కష్టించి పనిజేయవలసి యుండెను. ఇందువలన హారలాలు శీఘ్రకాలములోనే పనినంతయు నేర్చుకొనెను. అందుచేత గుమస్తాలితనిపై యీర్ష్యగలవారై యుండిరి కాని వారేమియు నాతని జేయలేకపోయిరి. కాల క్రమమున హారలాలునకు నెలకు 40 రూపాయల జీతమాయెను. అప్పు డాతడొక సందులో నొకచిన్నయిల్లద్దెకు బుచ్చుకొని

మైనతల్లి నచ్చటికి వచ్చెను. బహుకాలమునుండి కష్టముల ననుభవించుచుండిన హారలాలు తల్లికి నాటినుండియు సుఖము గల్గెను.

వేణుగోపాలుని సంగతి తనకొడుకు పలుమారామెతో జెప్పియుండుటచే నాతనిని జూడవలెనని యామె యనుకొనెను. తాను స్వయముగ వంటచేసి తనకొడుకుతో భోజనమునకు గోపాలుని పిలువవలెనని యామె తలచెను. కాని హారలాలు తమ యిల్లంత పెద్దదిగాదని యీవిషయము వచ్చినప్పుడెల్ల నేదో యొకమాటజెప్పి యాతనిని మాత్రము భోజనమునకు పిలువలేదు.

## VI

వేణుతల్లి మృతిబొందెనను వార్త హారలాలుకు దెలిసెను, కావున నాడొకనిముషమైన నాలస్యము జేయక వేణుగోపాలునిజూచుటకు అథరబాబింటికి వెళ్లెను. అప్పటినుండియు తరుచుగ గురుశిష్యులొకరినొకరు చూచుకొనుచుండిరి.

కాలముమారిపోయెను. వేణునకు సంపూర్ణయౌవన మొచ్చెను. నూనూగు మీసములాతనికి మరింతశోభనిచ్చెను. నాగరకలక్షణములలో నాతనికి తెలియని వేవియు లేవు. అనేక

మంది స్నేహితు లాతని నెప్పుడువిడువ కుండనుండిరి. పూర్వ కాలపు బల్లయు, సిరాబుడ్డియు, డస్కును నేడాతని గదిలో లేవు. పెద్ద యద్దములును, ఫొటోగ్రాఫులును, మడతకుర్చీలును, క్రొత్తబల్లయు మొదలగున వెన్నియో యాగదియం దుండెను.

వేణు కాలేజిలో ప్రవేశించెను. ఆత డింటరుమీడి యేటుపరీక్ష ప్యాసగునను నమ్మక మేమియు లేదు. హారలాలు తన తల్లి వేణుగోపాలుని భోజనమునకు బిలువవలెనని చెప్పిన మ్మాట మరచిపోలేదు. కాని చాల యోచించి వేణుగోపాలు నాతడు భోజనమునకు బిలచెను వేణుగోపాలుని హారలాలు తల్లి మిక్కిలి ప్రేమతో జూచెడిది. భోజన మయిన వెంటనే గోపాలు డింటికిబోవలెనని తొందర పడెడివాడు.

వేణు తన చేతికి గట్టుకొని యున్న బంగారు గడియార మునుజూచుకొని తన కవసరమైన పనియున్నదని చెప్పివాకిటముం దున్న తనబండిలోని కెగిరిదూకును. అంతట నాబండివాడు తొందరగ బండినిదోలుటచే తానింటికి బోవును. అప్పుడు హారలాలొక నిట్టూర్పువిడచి, గోపాలుని యికనెన్నడు తనయింటికి భోజనమునకు బిలువనని తనలో తా ననుకొనును.

## VII

ఒకదినము ప్రొద్దుబోయి హారలాలు ఆఫీసునుండి యింటికి వచ్చెను. చీకటిగదియం దెవరో మనిషి యున్నట్లాతనికి దోచెను. ఐననేమియు బాటింపక నాతడు లోనికిబోవుచుండెను. ఇంతలో సువాసన యెక్కువగ వచ్చుటచేయందున్న దెవరో తెలుసుకొనవలెనని యాతడు నిశ్చయించి "ఎవరువారు" అని ప్రశ్నించెను. "మేష్టరుగారు! నేను గోపాలుడను" అను ప్రత్యుత్తర మొకటి వచ్చెను.

హార—విశేషములేమి! నీవు వచ్చిన దెప్పుడు?

వేణు—నేను చాల సేపటిక్రిందనే వచ్చియుంటిని. మీరింతప్రొద్దుబోయి వచ్చెదరని నేననుకొనలేదు.

ఈ సంభాషణ జరిగినతరువాత వారిద్దరును మేడమీదికి బోయిరి. హారలాలు దీపమును ముట్టించి "అంతయు చక్కగ నున్నదిగదా" అని వేణునడిగెను. అప్పుడు వేణు తనకు కాలేజీకివెళ్లుట చాల కష్టముగ నున్నదనియు, ప్రతిసంవత్సర మొకటే క్లాసులో నుండుట తనకులజ్జాకరమనియు, తరగతిలోనివిద్యార్థులు తనకన్న చిన్నవారగుటచే తనకు మరింత కష్టముగా నున్నదనియు చెప్పెను.

హర:—నిశ్చయమే కాని నీయుద్దేశ్య మేమి?

వేణు:—నేను సీమ దేశమునకు బోయి బారిష్టరు పరీక్ష ప్యాసయి రావలెను. నా కన్న తెలివి తేటలలో తక్కువగా నున్నవాడొకడిప్పుడు సీమ దేశమునకు బోవుటకు సంసిద్ధుడైయున్నాడు.

హర:—మీ తండ్రి గారందులకంగీకరించినారా!

వేణు:—ఇంటరుమీడియేటు పరీక్ష ప్యాసయినదాక నామాట లేమియు మా తండ్రి వినడు, నేనా క్లాసు ప్యాసగు పస్థితు లేమియు గన్పడవు.

హర:—నేను నీవిషయమై మీ తండ్రితో మాట్లాడెదను.

కాని దానికి వేణుగోపాలు డేమియు మాట్లాడలేదు, భోజనమునకుండుమని హరలాలు వేణును బలవంతపెట్టెను. దానికి గోపాలు డిష్టపడెను. తరువాత వారేమియో సంగతులు మాట్లాడుచున్నపుడు హరలాలు గోపాలుని భుజముపై తన హస్తమునుంచి ప్రేమతో నిట్లు జెప్పెను. "వేణు నీవు మీ తండ్రితో పోట్లాడకూడదు. ఇల్లు విడచి పర దేశములకు బోకూడదు." ఇట్లు హరలాలు చెప్పునప్పటికి గోపాలునకు కోపము వచ్చెను. ఆతని దగ్గరనుండి గోపాలుడు లేచిపోయెను. అప్పుడు హరలాలాతనిని తిరిగిలోపలికి గొనివచ్చి భోజనము

చేయకుండ బోవుట భావ్యముగాదని పలికెను కాని గోపాలుడు వినలేదు. ఇంతలో హారలాలు తల్లివచ్చి గోపాలుని బ్రతిమాలుటచేత నా డాదినమున భోజనమున కుండెను.

వారు భోజనమును జేయుచున్నప్పుడు వీధిలో బండి చప్పుడు వినవచ్చెను. అంతలో నొకసేవకుడు వారున్నగది లోనికొచ్చెను. వానివెంటనే అధర్ బాబు గూడ వచ్చెను. వేణు తెల్లబోయెను. క్రొత్తపురుషులు తమయింటికి వచ్చుటచే హారలాలు తల్లి లోపలికి బోయెను. అధర్ బాబు కోపముతో హారలాలును జూచి యిట్లనెను. "రతికాంతుడు నీ విషయమై జాగ్రత్తగనుండుమని నాతో జెప్పెను. కాని నీవింతటి క్రూరాత్ముడవని నేననుకొనలేదు. నీవు నాకొడుకు వలన జీవింపనెంచితివి. ఈవిధమున నాకొడుకును నీవు బలవంతముగ స్వాధీన పరచుకొనుట నీకు మంచిదిగాదు. నిన్ను పోలీసు కోర్టులో వ్రాసికుర్యాటు జేసెదను."

వేణేమియు మాట్లాడక తన తండ్రితో నింటికి బోయెను.

## VIII

హారలాలు పనిజేయుచుండిన కంపెనీవారు బియ్యమును పప్పును అనేకచోట్ల నుండి విశేషముగ గొనుచుండిరి. కావున

ప్రతిశనివారము ప్రొద్దుటిరైలులో డబ్బుతీసుకొని వెళ్లి యందరికి నాతడిచ్చి వేయుచుండును. ఇంతడబ్బు హారలాలు దగ్గర నుండుటచే నాతని యొద్దనుండి కొంతధరావతు పుచ్చుకొనుట భావ్యమని కంపెనీవారు తలచింగాని మ్యానేజరు హారలాలు యొద్దనుండి యేమియు పుచ్చుకొనవసరము లేదని చెప్పుటచే హారలాలుకీ నూతనకష్టము దీరిపోయెను. హారలాలునకు డిశెంబరునుండి ఏప్రియల్‌వర కట్టపని విశేషముగ నుండుటవలన యాతనికేమియు విశ్రాంతి లేకుండెను. ఆతడు పనినుండి వచ్చునప్పటికి చాలప్రొద్దు బోవుచుండెను.

హారలా లింటలేనప్పు డాతని తల్లి వేణునుబిలచి తరుచుగ యన్నము బెట్టుచుండును. ఏలనన గోపాలుడు తల్లిలేని బిడ్డడని యామె వానియం దెక్కువప్రేమగలిగి యుండెను. ఒకదినమున వేణు హారలా లొచ్చువరకుండి వానితో మాట్లాడుచు చాలసేపుగూర్చుండెను. ఆసందర్భమున వారిట్లు సంభాషించిరి.

గురోత్తంసమా! ఇక నేను మాతండ్రితో నుండజాలను. ఇంతియుగాక నాజనకుడు తిరిగివివాహము చేసుకొన యత్నించుచున్నాడు. రతికాంతుడు తగినసంబంధమును గుదుర్చుటకై చేయవలసిన ప్రయత్నములన్నియు జేయుచున్నాడు. ఒకనిముష

మైన నేనింట గన్పించకున్న మాతండ్రి విచారించు సుదినములు గడచిపోయినవి. ఇప్పుడు నేనింట లేకుండుటే యాయనకు సంతోషము. ఇకను నాతండ్రి వివాహమే చేసుకొనిన యెడల నేనాయింటనుండు టసంభవము. నాకేది యోయొక యుపాయమును మీరు దయచేసి చెప్పవలెను. నేనిక స్వతంత్రుడనై యుండవలెను.

హారలాలునకీ మాటలు వినినప్పటినుండియు మనోవేదన యక్కువాయెను. తనశిష్యునకు తానెట్టిసలహా నియ్యవలసినదియు ఆతనికిదోచలేదు. తానింగ్లండునకుబోయి బారిష్టరుపరీక్ష చదువవలెనని గోపాలునిదివరకే హారలాలుతో చెప్పియుండెను. ఓడప్రయాణముల కగుఖర్చును తానెవరికయిన వ్రాసి దేవలసియుండుననియుఅప్పిచ్చిన హారువ్యాజ్యమును దెచ్చినపుడాతనితండ్రి తప్పకసొమ్మిచ్చుననియు, అప్పుతెచ్చిన డబ్బుతో తా ను సీమ దేశమునకు బోగలననియు, సీమకుచేరినతరువాత తనతండ్రి తనకు తప్పక డబ్బుపంపుననియు గోపాలుడు హారలాలుతో ననెను.

హార:—ఐతే యిప్పుడు నీకుడబ్బిచ్చువారెవరు!

గోపా—మీరె.

హార—నేనా!

అని హారలాలత్యాశ్చర్యముతో ననెను.

గోపా——నిశ్చయముగ మీారెనాకు గావలసినధనము నీయుటకు సమర్థులు. ఏలన ననేకసారులు మీాయింటికి సేవకులు ధన సంచులను దెచ్చుట నెరుగుదును.

హారలా——నిశ్చయమేకాని సేవకులమీాదను డబ్బుమీాదను నా కేమాత్ర మధికారము లేదు.

అనిహారలాలు తనయింటికి ధన మేల పనినారు దెచ్చు చుండిరో, దాని నాతడందరి కెట్లీయవలసియుండెనో యంతయు సావధానముగ గోపాలునకుఁ జెప్పెను.

గోపా——మీా కంపెనీ మ్యానేజరు నాకు డబ్బునీయజాలడా?

హార——ఆయన మీా తండ్రి జామీానుగ నుండనిది నీ కేమియు నీయజాలడు. ఇంతటితో వారి సంభాషణముగిసెను.

శుక్రవారమునాడు వేణుగోపాలుడు బండినెక్కి హారలా లింటికొచ్చెను. అప్పుడు హారలాలు తన పడకగదిలో క్రింద గూర్చుండి డబ్బులెక్కబెట్టుకొనుచుండెను. గోపాలుడు సామా న్యముగ తాను ధరించు దుస్తులను దీసి పారసీకోటును, క్రాౌజ ర్లును, తలపై నొకటోపీని బెట్టుకొని యుండెను. చేతి వేళ్ళన్నిటి కన్ని యుంగరములుండెను. మెడలో బంగారు గొలుసు వేలాడుచుండెను. జేబులోబంగారుగడియారముండెను.

చోక్కాయొక్క చేతి గుండీలు వజ్రములతో పొదగబడియుండు టచే వాటికాంతులు మిరుమిట్లుగొలుప్రచుండెను.

హారలా లాతనినిజూచి యట్టి దుస్తులను ధరించుటకు గల కారణమేమని గోపాలు నడిగెను. దానికి గోపాలుడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "రేపు మాతండ్రి వివాహము. ఈసంగతినాకు దెలియకుండ నుండుట కాతడెంత ప్రయత్నించినను నాకది యంతయు దెలిసినది. ఇచ్చటికి గొంతదూరములో నొకయూరుగలదు. దానిలో మాకు తోటలున్నవి. నేనక్కడనుండెద నని మాతండ్రి నడిగితిని. మా తండ్రి యందులకి ష్టపడెను. కాబట్టి నేడు నేనక్కడికి బోవుచున్నాను. నాకు దైవము మేలు చేయ నెంచెనేని తిరిగి నేను మాజనకునింటికిరాను."

అప్పుడు హారలాలు గోపాలుని యుంగరములను జూచుచుండెను. ఆ యుంగరములన్నియు తనతల్లివని గోపాలుడు హారలాలుతో జెప్పెను. అంతట హారలాలు వేణుగోపాలుని భోజనము జేసితివా"యని యడిగెను. చేసితినని యాతడుబదులుచెప్పెను. అప్పటికింకను హారలాలు భోజనము చేసియుండ లేదు. డబ్బంతయు లెక్కబెట్టి యినుపపెట్టెకు తాళము వేసి లోనికిబోవుటకాతడు నిశ్చయించుకొనెను. కాని గోపాలుడు తా

నచ్చుటనుండి పైకమును జాగ్రతగ జూచుచుండెదనని చెప్పుటచే హారలాలు కొంచె మనుమానించి భోజనమునకరిగెను.

త్వరలో భోజనము జేసి హారలాలును, యాతని తల్లియు వచ్చిరి. అంత ముగ్గురును ధనరాసులయొద్ద గూర్చుండి మాటాడుచుండిరి. అప్పుడర్థరాత్రి యాయెను. వేణు గడియారమును, దీసిజూచి రైలు వేళ యైనదని చెప్పి తన గడియారములును, ఉంగరములును, బంగారు గొలుసులును హారలాలు చేతనుంచి వానినాతని యొద్ద నుంచుమని చెప్పెను. అంత హారలాలు వానినన్నియునొక సంచిలో బెట్టి యినుప పెట్టెలో బెట్టెను. వేణు వెళ్ళిపోయెను. కాన్వాసు సంచులన్నిటిలో నోట్లను బెట్టియుంచియు, మిగిలిన డబ్బును హారలాలినుప పెట్టెలో బెట్టెను.

## IX.

హారలాలినుప పెట్టెయొక్క తాళము చెవులను తలక్రింద బెట్టుకొని నిద్రించుచుండెను. కలలో వేణుతల్లిగనుపించి హారలాలును తెరచాటునుండి తిట్టుచుండెను. ఆమె మాటలన్నియు హారలాలునకు స్పష్టముగ తెలియలేదుగాని యామె నగల యొక్క కాంతి యాతని నచ్చెరువొందునట్లు జేసెను. హారలాలు వేణునుపిలువ నెంచెనుగాని యాతని నోటినుండి మాట రాలేదు.

తుదకు పెద్దధ్వనితో తెర క్రిందపడెను. అప్పుడుహారలాలు లేచి నలుదిశలుజూచెను. ఆతని కేమియు, గన్పించ లేదు. అప్పుడు కిటికీనుండి గాలివచ్చుటచేత దీపమారిపోయెను. హారలాలు యొక్క మేనంతయు చెమటతో తడిసిపోయెను. ఆతడుతిరిగి దీపమువెలిగించి గడియారమును జూచెను. అప్పుడు నాలుగు గంటలు వేళఅయినది. ఆతడికనిద్రించుటకు వేళలేదు. కావున హారలాలు లేచి ముఖమునుకాళ్ళను గడుగుకొనెను. అప్పుడాతని తల్లి "బాబు! యింతప్రొద్దున నే యేల లేచితివి?" అనియడిగెను.

ప్రతిదినము తనకు శుభముగల్గుటకు నిద్ర లేచిన తోడనే తన తల్లినిజూచుచుండెడి నీమము హారలాలునకు గలదు. ఆనాడు గూడను తనతల్లిని దర్శించి వెండియు, నోట్లును గలిగియున్న సంచులను దీయనారంభించెను. అకస్మాత్తుగ నాతనికి మనో వ్యాకులము నొచ్చెను. అతని దేహమే అతనికి తెలియ లేదు.

ఆసంచులలో మూడు సంచులయందేమియు లేదు. ఆసంచుల నాతడినుపపెట్టెపై గొట్టెను. దానితో యాతనికి సర్వమును విదితమాయెను. ఆసంచులను దీసి తిరిగిచూచెను. వాటియందు రెండు ఉత్తరములుండెను. ఆయుత్తరములుగోపాలుడు వ్రాసెను. దానిలోనొకటి వానితండ్రికి వ్రాసెను. మరియొకటిహారలాలు పేరనుండెను. హారలాలుతన పేర వేణు వ్రాసినఉత్తరమునుచించిచది

వెను. దానిలోని సంగతులాతని కర్థముకాలేదు. కావున హార లాలు తిరిగి యాయుత్తరమును చదివెను. సారాంశమును గ్రహించెను. వేణుమూడువేల రూపాయలను తీసుకొని సీమకు వెళ్ళెను, "నేను మాతండ్రి కొకయుత్తరమును వ్రాసితిని. దానిలో నన్నిసంగతులును విశదముగ నున్నవి. మీకివ్వవలసిన డబ్బు మాతండ్రియిచ్చును. లేనియెడల నేనుమీచేతికిచ్చిన మా తల్లినగలే మూడువేలను మించియుండున"ని గోపాలుడా యుత్త రములో హారలాలునకు వ్రాసెను.

హారలాలు కేమియుదోచలేదు. తనగదికితాళము వేసిబిక బండిచేసుకొని వేణుగోపాలుని గలుసుకొనుటకై హారలాలు బయలుదేరెను. వేణుగోపాలుడు సీమకు బోవుటకెక్కిన యోడ యానాడేబయలుదేరెను. కాని హారలాలు దురదృష్టవశమున సీమకానాడు రెండోడలు బయలుదేరిపోయెను. గోపాలుని కనుగొనుటకాతనికి వీలుపడలేదు.

హారలాలింటికి వచ్చినప్పటికి బాగుగ తెల్లవారెను. వాని తల్లి వరండాలోకివెళ్ళి తనకొడుకును "ఎక్కడనుండి వచ్చుచుం టివ"ని యడిగెను. హారలాలు మాట్లాడలేదు. ఆతడు మూర్ఛ బోయెను. తరువాత కొంతసేపటి కాతనికి స్మృహవచ్చెను. అం తట తనతల్లిని లోనికి వెళ్ళుమనిచెప్పి హారలాలు తనగదిలోనికి

బోయి తలుపునకు గడియవేసుకొని లోపలకూర్చుండెను. హార లాలుయొక్క తల్లి బయట యెండలోగూర్చుండి "బాబా. బాబా. బాబా" యని యూరక పిలుచుచుండెను.

ఇంతలో మానేజరుయొక్క ఆఫీసునుండి బంట్రోతు వచ్చెను. రైలువేళయైపోయినదని యాతడుహారలాలింటి తలుపు తొందరగ గొట్టెను. "ఇప్పుడు నేనురాలేన"ని హారలాలు ప్రత్యుత్తరమిచ్చెను.

బంట్రోతు:—ఐతే మనమిప్పుడెక్కడికి బోవలెను.

హార:—దాని సంగతినేను తరువాతజెప్పెదను.

అంత నాబంట్రో తనుమానముగలవాడై మేడమీద నుండి క్రిందికిదిగిపోయెను.

హారలాలునకు గోపాలుడిచ్చిన నగలు జ్ఞాపకమున కొచ్చెను. ఇది యాతనికి కొంత యాశను గలిగించెను. కాబట్టి హారలాలు వేణుగోపాలుడు తన తండ్రికి వ్రాసిన యుత్తరమును నగలును దీసుకొని అధర్‌బాబుయొక్క యింటికి బయలు దేరెను. అధర్‌బాబుయొక్క యింటిలో వివాహము గాన బాగుగ బ్యాండు వాయించుచుండిరి. అప్పుడుహారలాలు యింటి లోపలికి బోయెను. ఇంటిలో కొంత కలవరము జరుగుచున్న ట్లాతనికి దోచెను. కొందరు పనివాండ్రు అధర్‌బాబు యిం

టిలో క్రిందటి దినముననే దొంగతనము జరిగినదనియు బాబు కొందరు పనివాండ్ర ననుమానించెననియు చెప్పిరి.

ఆధర్ బాబు కోపముతో మేడమీద కూర్చుండెను. రతికాంతు డాయన ప్రక్కనే హుక్కా త్రాగుచుండెను. అప్పుడు హరలాలు ఆధర్ బాబును జూచి వినయముతో "అయ్యా! మీతో రహస్యముగ కొన్ని సంగతులు మాట్లాడవలెను" అని యనెను. ఆధర్ బాబు హరలాలు డబ్బుకొరకై వచ్చియుండు నని తలచి యాతనితో "నాకిప్పుడు నీతో మాట్లాడుటకు వీలు లేద"ని కోపముతో ననెను.

రతీకాంతుడు తానుండుటవలన హరలాలేమైన చెప్పుటకు వీలులేనియెడల తానచటినుండి వెడలిపోవుదుననెను గాని ఆధర్ బాబు వాని నచటనే యుండుమనుటచే రతీకాంతు డచటనే యుండెను.

హరలాలు వేణు తన కిచ్చిన సంచిని ఆధర్ బాబున కిచ్చెను. సంచిలో నేమున్నదని బాబు హరలాలు నడిగెను. సంచిలోని వస్తువులను దీసి హరలాలు బాబు కిచ్చెను. "సరే గురుశిష్యు లిద్దరును మంచిపని జేసినారు. దొంగసొమ్ము బయలు బడిన మోస మను తలంపుతో నీ వీవస్తువుల నిచ్చి నావలన

బహుమానము తీసుకొనదలచితివా?" యని బాబు హార లాలుతో ననెను.

హారలాలు వేణు తన తండ్రికి వ్రాసిన యుత్తరమును అధర్‌నకు జూపెను. దీనిచే అధర్ బాబు కోపము మునుపటి కన్న నెక్కువాయెను. "ఇది యంతయు యేమిటి? నేను పోలీసులను బిలచెదను. నాబిడ్డ లేక్రబాయమున నున్నాడు. వానిని రహస్యముగ నీవు పరదేశ మంపినావు. అతనికి నీవు రెండు మూడు వందలిచ్చి మూడువేల కాయనూయకునిచే వ్రాయించుకొని యుందువు. కాబట్టి దీనికంతకు నేనేమియు బాధ్యుడను గాను" అని బాబుచ్చైస్స్వరముతో హారలాలును జూచి బల్కెను.

హార—నే నాతని, కేమియు డబ్బునిచ్చి యుండలేదు.

బాబు—అట్లయిన వేణున కంత డబ్బెట్లు దొరికినది? నీ యినుపపెట్టె పగులగొట్టి తీసుకొనెనా?

హారలా లేమియు మాట్లాడలేదు.

అంతట హారలాలు అధర్ బాబు యింటినుండి బయలు వెడలెను. ఇప్పు డాతని కే విషయమందును భయము కలుగ లేదు. ఏపని జేయుట కాతనికి దోచలేదు. తన యింటికి బోవు సందులో హారలాలు ప్రవేశించెను. వాని యింటిముందొక బండి

యుండెను. ఆ బండి వేణుగోపాలుని దని యాత డనుకొనెను. త్వరగ యాత డింటికి బోయెను. బండిలో నొక దొర కూర్చొని యుండెను. ఆతడు హారలాలు పని జేయుచున్న కంపెనీలోని యధికారి.

ఆ యధికారి హారలాలు తనకు గనుపడినంతనే బండిలో నుండి దిగి యాతని చెయిబట్టుకొని "నీ వీదినమున ప్రొద్దటి రయిలు కేల బోయియుండలేదు" అని ప్రశ్నించెను.

హారలాలు మూడువేల రూపాయలనోట్లు బోయెనని చెప్పెను కాని యా యాంగ్లేయు డా మాటలను నమ్మలేదు. హారలా లింకేమియు మాట్లాడలేదు.

మనము మేడపైకివెళ్ళి నీవు డబ్బుపెట్టిన చోట జూచెద మని యాతడనెను. హారలాలందుల కిష్టపడెను. వారందరు మేడ పైకి బోయిరి. డబ్బంతయు లెక్కబెట్టుకొన్న పిదప హారలా లిల్లంతయు సోదాచూడబడెను.

ఇదియంతయు జూచిన తరువాత హారలాలు తల్లి చింతాక్రాంతయై తన కుమారుని జూచి "బాబా యేమి జరిగినదని" యడిగెను. దానికి హారలాలు హీనస్వరముతో "ధనమపహరింప బడినది" అనిచెప్పెను. "దొంగతనమా! ఎట్లుజరిగినది? అట్టి నీచపు పని నెవరు జేసియుందురు" అని హారలాలు తల్లి యనెను.

దీని నంతయు హారలాలు విని "తల్లీ! నీవేమియు మాట్లాడవద్దు" అని యామెను బ్రతిమాలెను. ఉన్నడబ్బును దీసుకొని, మానే జరుయొద్దకు రమ్మని హారలాలుతో నాయాంగ్లేయు డనెను.

వారిత్రోవకడ్డముగ నిలుచుండి హారలాలు తల్లి వారితో నిట్లనెను "అయ్యా! మీరు నాకుమారునెచ్చటకు దీసుకొని పోయెదరు! సర్వకష్టముల ననుభవించి, ధర్మమార్గానుసారినై వానిని చిన్నప్పటినుండియు బెంచితిని. నాబిడ్డ పరులధనము నాసింపడు." ఆదొర కామె చెప్పిన దేమియు తెలియలేదు.

"అమ్మా నీవేమియు పరితాపపడనవసరములేదు. నేను మ్యానేజరుతో మాట్లాడి తిరిగి యిప్పుడేవచ్చెదను. అప్పటివరకోపిక బట్టుమని" హారలాలు తన జననితో ననెను. అంతనా యువతీలలామ దుర్భరమగు శోకంబున మాట్లాడలేక హీన స్వరంబున "బాబా! నీవు ప్రొద్దటినుండియు పిడిచెడన్నమైనను తినలేదుగదా" యని భూమిపైబడి మూర్ఛిల్లెను.

హారలాలు బండిలో గూర్చుండి మ్యానేజరు యొద్దకు పోయెను.

మ్యా— నిశ్చయముగా జరిగిన దంతయు జెప్పుము.

హార— నేను మీడబ్బులో నొకకాసైనను ముట్టుకొనలేదు.

మ్యా—అదినాకు తెలుసునుగాని, డబ్బునెవరు తీసుకొన్నదియు నీకు తెలియదా?

హారలాలంత తలవంచుకొని భూమిపైజూచుచు మిన్నకుండెను.

మ్యా—ఎవరో యొకరు మీయిష్టముతో డబ్బును తీసుకొని యుందురు.

హార—నేను జీవించి యుండగ నాయిష్టప్రకారమింకొకడు డబ్బును దీసుకొనుట యసంభవము.

మ్యా—ఇంకొకమాట జెప్పెదను. నీయందునాకు లేశమైనను అనుమానములేదు. చాలబాధ్యతగల పనిలో నిన్ను నేను ప్రవేశపెట్టితిని. నేన్నిట్లు చేయుటచే నామీద మన ఆఫీసులోని వారు కోపముగ నున్నారు. మూడువేల రూపాయలన్న నాకు బహుస్వల్పము. కాని దీనివలన నాకు గలిగిన యవమానమును మాత్రము నే నెక్కువగ తలచుచున్నాను. కాబట్టి యిప్పుడు నేనొక పనిని మాత్రము జేసెదను. అదేమనిన నీకీ దినమంతయు గడువిచ్చెదను. ఈదినములోపల నీవు డబ్బు తిరిగి తెచ్చియిచ్చినయెడల నేనేమియు యీవిషయమై ప్రస్తావన దేక నీ యుద్యోగమును తిరిగి నీకిచ్చెదను.

# X

పగలు పదకొండు గంటలాయెను. హారలాలు తలవంచు కొని కచేరినుంచి బయటికి బోయెను. ఆఫీసులోని గుమాస్తా లందరు హారలాలు విషయమై మిక్కిలి సంతోషముతో మాట్లాడు కొనుచుండిరి.

"ఇప్పుడు నేనేమి చేయుదును-ఇప్పుడు నేనేమి చేయు దును" అని హారలాలు తనలో తానాలోచించు కొనుచుండెను. హారలాలుతానెచ్చటికి బోవునదియు తెలియకుండగనే యెండలో నడుచుచుండెను.

వేలకు వేలుగల యాపట్టణరాజములో నేడీ హారలాలు తలదాచుకొనుటకు స్థలములేదు. ఎవరికిని యాతనియందు ద్వేషములేదు గాని ప్రతి వాడాతనికి మాత్రము శత్రువు. కచే రీలలోని గుమాస్తాలు మధ్యాహ్నము తమ ఫలహారములను రోడ్డు ప్రక్కలబెట్టుకొని తినుచుండిరి. ప్రక్కయూళ్లనుండి వచ్చిన జనులు మార్గాయాసముచే చెట్లక్రింద పరుండి నిద్రించుచుండిరి. ఇతరయూళ్ళస్త్రీలు బండ్లలోనెక్కి దేవాలయ ములకు బోవుచుండిరి. సాయంకాలమైనను హారలాలునకు విశ్రాంతిగాని భోజనముగాని లేదు. ఆతడింకను కాళీఘట్టము లోని వీథులలో తిరుగుచునేయుండెను. దీపములన్నియు చిత్రే

చిత్రములుగ వీధులయం దలంకరింపబడెను. కాని హారలాలు నేడు వాటిని జూడలేదు. ఇవి యన్నియు, వానికి వింతగొలుప లేదు. అప్పుడెంత ప్రొద్దుపోయెనో కూడ యాతడెరుగడు.

ఇంతటి మనోవేదనలో, ఇన్ని పట్టణ సౌందర్యములలో ఆతని కొక్క దివ్యరూపమే గనుపడుచుండెను. అది యాతని మాతృరూపము. ఆరూప మాతని బాధలన్నియు బోగొట్టుచుండెను. తాపముల నణచుచుండెను. అపరిమితానందమును గలుగజేయుచుండెను.

అప్పుడా హారలాలు, నిష్కళంకుడగు హారలాలు, సత్యస్వరూపియగు హారలాలు మాతృపాదద్వయ మర్చించు హారలాలొక రూపాయియిచ్చి బండిని కుదుర్చుకొని గూర్చుని, తనతలను బండియొక్క కిటికీలోనుంచి తిరిగినవీధులగుండ దిరుగుచు, చూచిన మనుష్యులనేజూచుచుండెను. కాని కొంతసేపటి కాతడు తన కండ్లను మూసుకొనెను. దానితో నాతని బాధలన్నియు అంతమాయెను. ఆతని శరీరము చల్లబడెను. శాంతము గల్గెను. ఆతనికి గలిగిన ప్రశాంతమున కాద్యంతములు లేవు. అప్పుడాతనికి దివ్యతేజ మొకటి గాన్పించెను. అది యాతని మాతృరూపము.

ఆపట్టణములోని వీధులు, వర్తకుల యంగళ్లన్నియు నాపవిత్రగానముతో నిండిపోయెను. ఆమె దివ్యదర్శనముతో నాతని దుఃఖ మెల్ల సంతోష మొందెను.

అప్పుడొకగంట వినబడెను. బండిదోలువాడు వినయముస హారలాలు నిట్లు బలుకరించెను. "బాబూ! యిక నా గుఱ్ఱము బండిని లాగ లేదు. మీరెక్కడికి వెళ్లవలెనో దయచేసి చెప్పుడు" దీనికి హారలాలేమియు మాట్లాడలేదు. బండివాడు తన బండిమీదనుండిదిగి హారలాలు చెంతకుబోయి యాయనపై చెయివేసి "బాబూ! మీరెచ్చటికివెళ్లవలెను"అని ప్రశ్నించెను.

దానికి హారలాలేమియు మాట్లాడలేదు, తానెక్కడికి బోవలసినదియు యెవరికిని జెప్పలేదు.

## అనగా అనగా ఒక రాజు.

అనగా అనగా నొకరాజని మా చిన్నతనములో నెవరైన నొక కథను చెప్పనారంభించినయెడల యారాజెవరో తెలుసుకొనవలెనని మాకెక్కువ కుతూహల ముండెడిదికాదు. అతనిపేరు శిలాదిత్యుడైనను, శాలివాహనుడైనను,మాకొకటే.

అతడు కాశిలోనున్నను, గయలో నున్నను, మాకేమియు విచారము లేదు.

కానియీయిరువదియవ శతాబ్దమున నెవరయిన "అనగా అనగా ఒకరాజు" అని మొదలు పెట్టిన యెడల ఎవరాగాజని వెంటనే యడుగుదురు. అందుచేత కథలను జెప్పువారు కూడ అనగాఅనగాఒకరాజని చెప్పుటమాని అతనిపే రజాతశత్రువందురు. కాని యిట్లు జెప్పినను కూడ ప్రశ్నలకంతముండదు. ఏలనన నిప్పుడుగూడ "ఎవరా అజాతశత్రువు" అనే ప్రశ్నయుండనే యున్నది.

నాచిన్నతనములో నీకథ చెప్పునప్పుడు నేను కిలకత్తాలో నుంటిని. ఆనాటి సాయంకాలము వర్షమును, తుపాను గాలియు విశేషముగనుండెను. వరదతో పట్టణమంతయు నిండి పోయెను మేమున్న సందులోనికి గూడ వరదనీరొచ్చెను. నాకు పాఠము చెప్పు నుపాధ్యాయు డానాడు రాడని నేను గట్టిగా నమ్మియుంటిని. ఐనను ఆయన వచ్చునేమో యని నేను వరండాలో కూర్చొని సందువంకనే జూచుచుంటిని. నాదృష్టియంతయు వర్షమువంకనే యుండెను. వర్షము కొంచెము తగ్గగనే యేడుగంటలన్నరవరకును వానకురియుటకై దేవునిని నేను ప్రార్థించువాడను. నన్ను మాయుపాధ్యాయుని బాధనుండి కాపా

డుటకన్న వర్షము వలన మఱి యొకలాభమేమియు లేదని నేను గట్టిగ నమ్మియుంటిని.

నాయూహ యేమైనను వర్షము మాత్రమాగిపోయెను. మామూలు వేళ కుపాధ్యాయుడు వచ్చుచుండెను. ఆతని గొడుగు నేను గుర్తించి వెంటనే నాతల్లి యొద్దకు పరుగెత్తి యామె యొద్దనున్న మంచముపయి శాలువ ముసుకు బెట్టుకొని పరుండి యామెకు కనికరము గలుగునట్లు నే నిట్లంటిని. "తల్లీ! నా కీదినమున తలనొప్పి యధికముగ నున్నది. నేను చదువుకొనలేను. ఉపాధ్యాయుడు వచ్చి యున్నాడ"ని చెప్పితిని. "అట్లె బిడ్డా"యని నాతో జెప్పియచ్చటనున్న పనివానినో కనిని బిలిచి యుపాధ్యాయుని "ఇంటికి బొమ్మ"ని చెప్పెను. దీనివలన నాకు గలిగిన సంతోషమునకు మేరలేదు.

లేని తలనొప్పితో నే నెంతకాలము బాధపడు[illegible] కాబట్టి కొంచెము నే పయిన తరువాత మాయవ్వను కథ జెప్పుమని యడిగితిని. కొంతసేపటివరకామె నామాటను వినిపించుకొననేలేదు. తరువాత నే నడుగగా, అడుగగా మాయమ్మకూడ అవ్వను కథ జెప్పుమనెను. దానితో నాకెక్కడలేని సంతోషము గలిగి యామెను నాపక్కపయికి లాగి కథను చెప్పుమని యడిగితిని. అంతనామె యిట్లని చెప్పెను. "అనగాఅనగా నొక

రాజు ఆరాజు కొకభార్య గలదు." అదృష్టవశమున ఆరా జునకొకతే భార్యయుండెను. సాధారణముగ పూర్వకాలమున జెప్పుకథలలో ఒక రాజున కనేక భార్య లుందురు. ఒక రాజున కిద్దరుభార్య లుండిరనగనే మనకుమిక్కిలి విషాదము కలుగును. ఏలనన వారిలో నొకరు మిక్కిలి దురదృష్టవంతురై యుందురు. కాని మాయవ్వ జెప్పిన కథలో మాత్రమా బాధ తప్పిపోయెను. సామాన్యముగ మనము కథలో తరువాత రాజు గారికి సంతతిలేదని విందుము. ఐన నాకప్పటి కేడుసంవత్సరము లే కావున రాజుగారికి సంతానములేదనిన నాకెక్కువ విచారము లేదు.

పిమ్మటమనము రాజుగారు సంతతికై యడవికి బోయె నని విందుము. కాని నేనుమాత్రము మా యుపాధ్యాయుడు చదువు చెప్పుటకువచ్చి నప్పుడుదప్ప మరియొకప్పు డెప్పుడైనను అడవికిబోను. రాజుగారడవికి బోవునప్పటికాయన కొకకూతు రుండెను. ఆమెకాల క్రమమున పెద్దదాయెను. పన్నెండు సంవ త్సరములా రాజేకదీక్షతో యరణ్యమందుండెను. కానియొక నాడయిన నారాజు తనప్రియ కుమార్తెను దలచియెరుగడు. పాపము! తనకుమార్తెకు వివాహకాలము సంప్రాప్తమైనను వివాహముగాలేదని రాణి మిగుల చింతించుచుండెను. అందు

నారాజు, తనయింటికి కొకసారివచ్చి భోజనము చేసివెళ్లుమని కొందరు మనుష్యులచేత రాజగారికి వర్తమాన మంపెను. దానికి రాజు గూడ యిష్టపడెను.

రాణి స్వయముగ రాజుగారికి మనోహరములగు పిండి వంట లనేకములువండి వెండి బంగారు పళ్ళెరములలో సన్నియు నమర్చియుంచెను. రాజు భోజనమునకు గూర్చుండెను. రాకొమరిత తనజనకునిచెంత నిలుచుండి విసరుచుండెను. ఆమె సౌందర్యముతో నాయిల్లంతయు దేదీప్యమానముగ వెలుగుచుండెను. ఆమె సౌందర్యమునుజూచి రాజు నిశ్చేష్టితు డాయెను. అప్పు డాతడు తన భార్యనుబిలచి యీరూపవతి యెవరని యడిగెను. దాని కాతబదేవి మిగులదుఃఖించి "అయ్యో! మీరు మీ కొమార్తెనే గుర్తించ లేకపోతిరిగదా?" యని యనెను. తన కూతురంత చక్కనిదని యాతడు విని విస్మితుడాయెను. అంత నారాజు తన కూతునకింకను వివాహమేల చేయలేదని యడిగి మరుసటిదినము ప్రాతఃకాలమున తానెవరిని జూచిన వానికిచ్చెదనని చెప్పి భోజనముచేసి పోయెను.

మరుసటిదిన మారాజు బయటకు వచ్చునప్పటికి యేడెనిమిదేండ్ల బ్రాహ్మణ పిల్లవాడు కట్టెపుల్లల నేరుకొనుచుండెను. వాని కతివైభవముతో తన కూతురునిచ్చి రాజు వివాహము చేసెను.

ఈమాట వినునప్పటికి నేనే ఆ బ్రాహ్మణ చిన్నవాడనైన నెంతటి యదృష్టవంతుడనోకదా యని నేననుకొంటిని. మాయి వ్యాఖ్యే గ్రంథకర్త్రిశ్రద్ధయున యెడల యీ చిన్నకథ కామె యెన్ని సమాధానములను వ్రాయవలసి యుండునో నేనూహింప జాలను.

ప్రతివారును మొట్టమొదట రాజుగారు 12 సంవత్సరము లడవిలో నేలయుండవలెనని యామె నడుగక మానరు. ఒకవేళ రాజుగా రట్లున్నను రాజుగారి కూతురికప్పటివరకేల వివాహము కాలేదని రెండవప్రశ్న రాకమానదు. తుదకిదియంతయు నిజము గాదందురు. ఎట్లైన నామె శక్తికొలది శ్రమపడి వీనికన్నిటికి తగిన సమాధానము చెప్పినను వివాహసందర్భములో సమాధానము కుదురుట మిక్కిలి కష్టము.

మొట్టమొదట వివాహమ్ము జరిగిన దనుమాట నెవరు నమ్మరు. జరిగినను క్షత్రియులకును, బ్రాహ్మణులకును వివాహ సంబంధ మసంభవమనియు, సాంఘిక విరుద్ధమనియు తలంచి యీవిషయమై పత్రికలకు జాబులనుగూడ వ్రాసెదరు.

నేను కథను సాంతముగవిన కుతూహలము గలవాడనై మాయవ్వను తరువాత కథను చెప్పుమని యడిగితిని. తరువాత నామె యిట్లని చెప్పెను.

ఆ బ్రాహ్మణ పిల్లవాడు ప్రతిదినమును పాఠశాలకు బోయి యుపాధ్యాయుల యొద్ద పాఠములను చక్కగా నేర్చు

కొను చుండెను. అట్లు కొంత కాలము గడచినపిదప వానితో చదువుకొను చుండెడి పిల్లలు "మీయింటిలోనున్న చక్కని స్త్రీ యెవరని" యాతనినడిగిరి.

ఆపిల్లవాడుకూడ కొన్నిదినముల వరకెట్టి ప్రత్యుత్త రంబీయ లేక రాకొమరితతో సర్వమును చెప్పెనుగాని యామె యేమియు చెప్పకపోవుటచే చాలకాల మిట్లుగడచి పోయెను.

ఒకదినమున బ్రాహ్మణబాలకుడు రాకొమరితను తన చరిత్రను చెప్పుమని మిగుల నిర్బంధించెను. కావున నామె యాదినమంతయు తన పడకగదిని మిక్కిలి చిత్రముగ నలంక రించి తనభర్తయగు బ్రాహ్మణబాలకునికి భోజనంబిడి యాతఁడు తినగ మిగిలిన పదార్థములను తానుతిని పడకగదిలోనికి బోయెను. పడకగదిలో బ్రాహ్మణపిల్ల వాడు నిద్రించుచుండెను. అకస్మాత్తుగ నొక పామాతనిని కరచెను. అందుచేత శ్రీరాజ కొమరిత వెళ్లునప్పటి కాతడు మృతిబొంది యుండెను. ఇంకను మాయవ్వ చెప్పదలచిన యెడల నేమైన కల్పనజేసి చెప్పి యాకుర్రవానిని బ్రతికించెడిదే కాని యింతలో నాకు నిద్ర వచ్చెను. కావున కథయంతటితో ముగిసెను. అప్పటికే నా కధికముగ నిద్రవచ్చుటచే నేనుగూడ నిద్రబోతిని.

---

